# మహేంద్రమణి

పిల్లల కథల సంపుటి...








శ్రీనివాస్ పబ్లికేషన్స్,
నెహ్రూ నగర్. తెనాలి..

3 అణాలు

# "మహేంద్రమణి"

[ పిల్లల కధలసంపుటి ]

నిర్వాహ

రఘునాధ్ & కిరన[redacted]బు



సంపాదకుడు

మండవ శ్రీనివాసరావుచౌదరి.

ప్రకాశకులు :

శ్రీనివాస్ పబ్లికేషన్స్,

నెహ్రూనగర్, తెనాలి.



[వెల 0-3-0

శ్రీనివాస పబ్లికేషన్స్‌వారి
రెండోప్రచురణ
సెప్టెంబరు 1953.



మండవ శ్రీనివాసరావుచౌదరి.

ముఖచిత్ర అలంకరణ :
వడ్డాది పాపయ్యగారు.

ముద్రాపకులు :
రవి ప్రింటర్స్, తెనాలి.

## ''మహేంద్రమణి''

నిజంగా రాముడికి చాలా ఆశ్చర్యమేసింది. తను చూస్తున్నది నిజమో కాదో వాడిబుల్లిబుర్ర చప్పున తేల్చుకొనలేకపోయింది. లాగు సరిచేసుకొన్నాడు. కాళ్ళువిదిలించాడు. కళ్ళునులుముకొన్నాడు అవే అక్షరాలు. తను పొరపడలేదని రాముడికి రూఢిఅయింది. నిజమే! ఇందులో తను పొరపడటానికి మట్టుకేమున్నదీ?

తనూ,తనక్లాసుపిల్లలు, నాగభూషణంమాష్టారూ ఎక్స్కర్షన్ కొచ్చారు. బెజవాడపట్టణమంతా నిన్నచూశారు. ఇవ్వాళ ఉదయం ఆనకట్ట, పవర్ హౌస్ చూశారు. మధ్యాహ్నం కనకదుర్గగుడి చూదామని వొచ్చారు. అందరూ గుడిచుట్టు ప్రక్కల తిరుగుతున్నారు. తనేమో మరికొంచెం దూరం - ఇటుకేసి వొచ్చాడు. ఇక్కడ ఈశాసనం కనపడ్డది. తీరా చూస్తే ఇందులో ఎవరుమాత్రం పొరబడటానికి ఏమున్నది? రాముడు జాగ్రత్తగా ఆ శాసనాన్ని మళ్ళాచదివాడు. అది శుభ్రమైన తెలుగులోవుంది. మీదుమిక్కిలి; అందులో వాడి కర్థంకాని పదమంటూ ఒక్కటీలేదు.

''ఇదీ మంచిదేఅయింది. లేకపోతే - ఈశాసనం నాకు కనిపించియెంతో కనిపించక అంతే అయ్యేది'' అనుకొన్నాడు రాముడు.

---

రచన : రావూరి భరద్వాజ.

---

వాడు పదహారోసారి ఆ శాసనాన్ని చదివాడు. మొదటి సారి ఏమున్నదో ఆతరువాత అన్నిసార్లూ అదే వున్న దందులో.

"ఇక్కడికి నిలువుగా మూడువందల గజాలదూరములో ఒక పెద్దరాయివున్నది. ఆరాయికి ఉత్తరముగా ఒక గుహ ఉన్నది. ధైర్యసాహసములతో ఆగుహలోనికి ప్రవేశించి నూటపాతిక దుముకులదూరంపోతే, అక్కడొక విశాలమైన బయలు ఉంటుంది. ఆబయలు మధ్యప్రదేశంలో పూలసెజ్జ ఆసెజ్జలో ఒక బంగారుబరిణ వుంటుంది. ఆబరిణలో దేదీప్యమానముగా ప్రకాశించే "మహేంద్రమణి" ఉన్నది. ఆ మణిని చేతనుంచుకొన్నవారికి, సకలఅభీష్టములు నెరవేరుతాయి. సాహసమున్నవారు ప్రయత్నించవచ్చును."

దాదాపుగా రాముడి కాశాసనం నోటికొచ్చింది. పదేపదే మననంచేశాడు. చేసినకొందికీ వాడికొబుద్ధి పుట్టసాగింది. తనెందుకు ఆమణికోసం ప్రయత్నించకూడదూ? శాసనం ప్రకారంచూస్తే అట్టే ఇబ్బందులున్నట్టు తోచదు. కాకపోతే "సాహసమున్నవారు ప్రయత్నించవచ్చును" అని చివర హెచ్చరికలాంటి దొకటున్నది. దీనినిబట్టి ఏదోకొంత చిక్కు వున్నదనే స్పష్టమవుతున్నది. అయినా తనుగూడా ప్రయత్నించి చూడటంలో తప్పేమీలేదు. అన్నీసజావుగావుంటే

సరేసరి లేదో? నిక్షేపంగా వెనక్కుతిరిగొస్తారు. అందు వల్ల పుట్టిమునిగిపోయేదేమీలేదు. అక్కడమణిఉంటే మం చిదే; లేనిపక్షంలో కాస్తదేహపరిశ్రమ చేసినట్టూఅవుతుంది, ప్రకృతిదృశ్యాలనుచూసినట్టూ అవుతుంది. ఈ విషయాన్ని తనవాళ్ళకుచూపటం ఏవిధంగానూ మంచిదిగాదనే నిర్ణయాని కొచ్చాడు రాముడు.

రాముడు వస్తుత: తెలివైనవాడుకాబట్టే ఇటువంటి ఆలో చన చేయగలిగాడు. ఇందువల్లవాడికి రెండువిధాలా లాభమే చేకూరుతుంది. భగవంతుడి దయవల్ల 'మణి' వుంటే - తతిమ్మావాళ్ళకు అదితెలిసే అవకాశంవుండదు. తెలిస్తే వాళ్ళుగూడా దానివుపయోగాన్ని ఆశించవచ్చు. అదేమీ జర గదో - వాళ్ళ అపహాశ్యానికీ గురికావటం తప్పుతుంది. ఏది ఏమైనప్పటికీ తనొక్కడే ఈకార్యక్రమానికి పూనుకోవటం క్షేమం.

రాముడినిశ్చయం తిరుగులేనిది. వాడు సరస్వతీదేవిని, శ్రీరామచంద్రుణ్ణి, హనుమంతుణ్ణి ధ్యానించాడు. శాసనాన్ని మరొక్కసారి మననంచేసుకొన్నాడు అందులో సూచించిన విధంగానే ప్రయాణంసాగించాడు. రాళ్ళురప్పలు దాటాడు. చెట్లను, మొక్కలను తప్పించుకొన్నాడు. మూడువందలు గజాలుపైకి ఎక్కాడు. అక్కడ చుట్టూచూశాడు కృష్ణా

గంభీరంగా పారుతున్నది. బ్రిడ్జిమీదనుంచి రొదపెడుతో రైలొకటి ఊళ్ళోకిదూకుతున్నది. మేడలు, మనుషులు చిన్న విగా కనిపించసాగాయి. వాడికేదో భయము, కొద్దిగా సంతో షము కలిగాయి. వెనక్కుతిరిగిపోదామనే ఊహగూడాతట్టింది. కాని వాడా ఊహను తొక్కిపారేశాడు. పట్టుదలను పెంచు కొన్నాడు. ఎదురుగావున్న పెద్దరాతిని సమీపించాడు. అంత కంటే పెద్దబండలేమీ అక్కడ లేకపోవటంచేత శాసనం లోని బండ అదే అయివుంటుందనుకొన్నాడు రాముడు.

రాముడుఊహ తప్పుగాలేదు. ఆబండ ఖచ్చితంగా శాస నంలో ఉదహరించబడ్డదే। వాడాబండకు ఉత్తరంగా తిరి గాడు. నిజంగా అక్కడొక గుహఉన్నది. చెట్లుతీగలు పెరిగి దానివాకిలి మూతపడిఉన్నది. రాముడు వాటినన్నింటిని తొల గించిచూశాడు. లోపలికి మెట్లుకనిపించినై. ఒక్కసారి చుట్టూచూశాడు. అమ్మను, నాన్నను, భాను అన్నయ్యను, కస్తూరికుక్కపిల్లను తలుచుకొన్నాడు. వాడికెందుకో భయం వేసింది. భయపడటాని కిందులో ఏమీలేదని వాడికి తెలు స్తూనేఉంది. కానీ భయంవెయ్యటముమాత్రము మానలేదు. వాడు గుండెచిక్కబట్టాడు. ధైర్యము కూడగట్టాడు. 'జై ఆంజనేయా' అంటూ మెట్లమీదుగా దిగనారంభించాడు. పాతిక మెట్లు దిగేవరకూ వాడిలో ఏ మాత్రమో భయం

మెదులుతూనేవుంది. ఆతరువాత వాడికిధైర్యము కలిగినది. ఒకప్రక్కనున్న రాతిగోడకు రెండుచేతులు ఆనించి గబగబా మెట్లు దిగసాగాడు. రానురాను వెలుతురు సన్నగిల్లి చివరికి, తనకుతానే కనిపించనంత చీకటయింది. తనెటు పోతున్నాడో అర్థంకావటల్లేదు. యెటుచూసినా చీకటి. వాడట్లాగే. ఒక్కొక్కమెట్టే దిగుతున్నాడు. కొంతసేపటికి, కాళ్ళకు మెట్లుగూడా తగల్లేదు. కానీ "భోయ్" మంటూ, ఎడతెగకుండా ఏదోశబ్దము వినపడసాగింది రాముడుకి భయమేసింది. కాళ్ళువణికాయి. గుండెలు దిగజారాయి. "మణి" మీద అసహ్యంవేసింది.

"నాకామణీవద్దు. ఏమీవద్దు. హాయిగా మాయింటికిపోయి చదువుకొంటాను. ఇకజన్మలో యిటువంటి పాడుపనులు చేయను. బుద్ధివచ్చింది" అని లెంపలువేసుకొన్నాడు. వెనక్కు తిరిగి ముందుకురాబోయాడు! ఆశ్చర్యం!! వాడు దిగివచ్చిన మెట్లలో ఒక్కటీ వాడికాళ్ళకు తగలలేదు. వంగి, చేతులతో తడివిచూశాడు. మెట్లులేవు. రెండుచేతులూ బార్లాగాచాపి వెదికాడు, చేతులకేమీ తగలలేదు. వాడిగుండె గుభేలుమన్నది. ఒక్కసారి యింటిదగ్గరవాళ్ళు, స్నేహితులు, బడి, నాగభూషణంమాష్టారు జ్ఞాపకము వచ్చారు. బావురుమని ఏడిచాడు రాముడు. వాడింక ఏడుస్తూనే

ఉన్నాడు ఆ "ఖో(య్" మనే శబ్దం క్రమక్రమంగా దగ్గ రగా రాసాగింది. ఆధ్వనికి రాముడిచెవులు దిబ్బటపడ్డాయి. మరోపదిసెకండ్లకల్లా ఆశబ్దము వాడికాళ్ళకిందినుండే విని పిస్తూ....మరికాసేపటికల్లా వాణ్ణి స్పృహతప్పేటట్టుచేసింది-

రాముడు కళ్ళు తెరిచాడు. విశాలమయిన మైదానం. ఆ మైధానంమధ్యన రకరకాల పూలతోనిండినబుట్ట వాడికి కని పించినది, రాముడు, అడుగులో అడుగులేసుకొంటూ ఆ బుట్టను సమీపించి, అందులోనించి బంగారు బరిణనుతీశాడు. ఆక్షణాన వాడి ఆనందం వర్ణనాతీతం. అమితోత్సాహంతో వాడా బరిణను విప్పిచూశాడు. అందులో కళ్ళుమిరుమిట్లు గొలిపే 'మహేంద్రమణి' ఉన్నది. వాడు పరిశీలనగా ఆ మణినిచూశాడు. దానిమధ్యలో నీరువంటి ద్రవమేదో కదులుతున్నట్టు వాడికితోచింది. వాడిసంతోషం సముద్ర మంత విశాలంగానూ, హిమాలయమంత యెత్తుగానూ ఉన్నది. ఆక్షణానా వాడిబుర్రలో మెదిలిన భావాలు కోట్ల కొలదిగా ఉన్నాయి. వాడామణిని కళ్ళకద్దుకొన్నాడు. కళ్ల మూసుకొని "నేనీ కొండచివరకెళ్ళాలి" అనుకొన్నాడు. వాడు కళ్ళు తెరిచి చూసేసరికి - ఆశ్చర్యం - నిజంగా -కొండ చివరవ ఉన్నాడు.

సంతోషం పట్టలేక వాడు గంతులేశాడు, పెద్దగా కేకలు

పెట్టాడు. దూరంగా కృష్ణానదిపారుతున్నది. ఏదోలాంటి గావుసు- అవతలవొడ్డునుంచి మెల్లగా ఇటు పెపుపాకుతోంది. వాడికిక ఇంటికివెళ్లే బుద్ధి పుట్టలేదు. ఏదికావాలంటే అదిచేసి పెట్టే 'మణి' తనచేతిలో ఉన్నది ఇంకా తను ఇంటికెందు కెళ్ళాలి ? ఎందుకు నాన్నచేత, అమ్మచేత తిట్లుతినాలి ? పంతులుచేత దెబ్బలు, రోజూ ఆపాడుబడిలోకి పోవటము, పాఠాలు చదవటము - ఎంత అసహ్యం ! ఇప్పుడు తను చదువుకోకపోయినా ఫరవాలేదు. మణినితలుచుకొని, కళ్ళు మూసి తెరిచేసరికి తను యెమ్మేపాసుకావమంటే అయిపోదూ? యిటువంటి బ్రహ్మాండమైన చిటకా తనదగ్గరుంటే-ఇంకా. ఆముఠికిబడి, గోడకుర్చీలు వెయ్యటమూ, ఎందుకీ వెధవ న్యూసెన్సంతా ?

సరాసరి ఇంటికెళ్ళగూడదనుకొన్నాడు. రాముడు. వాడికి చాలాకాలంనుండి మద్రాసు చూడాలనివుంది. వెళ్ళినప్పుడల్లా నాన్నవర్ణించి చెపుతుంటే వాడికి ఒక్కసారి పట్నంచూదా మని మహాఉండేది. కానీ నాన్న ఒప్పుకోలేదప్పుడు. ఇప్పు డో ? తనను ఎవరుకాదంటారు ?

వాడు మదరాసు వెళ్ళాలని మణిని తలుచుకొన్నాడు. అంతే ! మదరాసులో ఉన్నాడు. మేడకావాలనుకున్నాడు. మరుక్షణాన మేడ రెడీగా ఉన్నది. చిన్నకారు కావాలను

కొన్నాడు. వాకిట్లో తళతళామెరుస్తో పరికొ్రిత్తకారు సిద్ధం గావుంది. రాముడు ఆకారును సముద్రం వేపు పోనిస్తున్నాడు. కారుశరవేగంతో పరుగెత్తుతోంది, ఎవరో రోడ్డుకుఅడ్డంగా పరుగెత్తుతున్నారు.

"ఏయ్ ఆగు ఆగు" అని రాముడు గొంతెత్తి అరిచాడు. అంతలో—

* * * *

"పెద్దన్నయ్యా బళ్ళోకెడుతున్నాడు నువ్వు లేవ్వేమిరా రాముడూ?" అంటూ అమ్మ కేకేసింది. రాముడు త్రుళ్ళిపడి లేచాడు ఎదురుగా అమ్మ కనిపించినది. కొద్దిక్షణాల పాటు వాడి కిదంతా విచిత్రంగా కనిపించినది. బిత్తరపోయి చుట్టూచూశాడు. తనచేతిలో చూసుకొన్నాడు రాముడు 'మహేంద్రమణి' కోసం. కానీ అది కల! కలలో కనిపించిన వ్యక్తులు, వస్తువులు యధారూపకంగా ఈలోకంలో కనిపించవని రాముడికితెలియదు. తనకిటువంటి గమ్మత్తయిన కలలెందుకొస్తాయో రాముడు ఇంతలో తెలుసుకోలేడు.

పిల్లలమనస్సులు నిర్మలమైన పాత్రలవంటివి. అందులో మనం విషంపోసినా, అమృతముపోసినా వాళ్ళు ఆరగిస్తారు. రాముడి కెవరో "మాయకథలు" చెప్పిఉంటారు. లేదా వాడే

ఎక్కడో చదివి ఉంటాడు. అందుకే వాడలాంటి 'మాయను' కలగన్నాడు. అటువంటి కలలుగనటం అనారోగ్యలక్షణము కానిమాటనిజమే ; కాని ఆ అనారోగ్యానికి - నిజంగా రాము దేమీ బాధ్యుడుకాడు. మరి వాడి మానసికపాత్రలో మనం నింపినదటువంటి 'సరుకు' అయినప్పుడు వాడెలా బాధ్యు డవుతాడు ?



## "సు నం ద"

కుంతలదేశమును శక్తిసింహుడనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతని రాజ్యములో ప్రజలు ఏయిబ్బందులూ లేకుండా హాయిగా జీవించుచుండిరి. పరిపాలనలో యే లోపమూ లేకపోయినప్పటికి రాజు గతించినపిదప తమను సక్రమముగా పరిపాలించుటకు రాజునకు ఎన్నాళ్ళకు పుత్ర సంతానము కలుగకపోవుటచే ప్రజలు దుఃఖితులై యెల్ల ప్పుడూ దైవమును ప్రార్థించుచుండిరి.

దైవమే వారిమొర ఆలించెనో అనునట్లు శక్తిసింహు నకు అతని యాబదియవయేట నొకపుత్రుడు జన్మించెను.

రచన : ర ఘు నా థ్

అతిదీర్ఘ కాలమునకు కలిగిన ఆశిశువునకు బ్రాహ్మణులను రావించి వేదమంత్రోక్తముగా సునందుడని నామకరణము జేసిరి. వేడుకలు, వినోదములు పూజలు అతివైభవముగా జేసిరి.

వత్సలరాజ్యాన్ని పులికేశుడనురాజు పరిపాలిస్తూ యుండెను. పేరుకుతగినట్లు రణరంగమున పులివలె శత్రువులను చెండాడును. కాని ఆరాజు మంత్రియగు కుటిలుడు చేతిలోని కీలుబొమ్మ. మంత్రి దుర్బుద్ధికిలొంగి అతినిర్మలముగానున్న కుంతలరాజ్యమును జయించుటకు నిశ్చయించి, ప్రచండ సైన్యముతో అకస్మాత్తుగావెళ్లి శత్రువులను చండాడు చుండెను. ధర్మప్రభువగు శక్తిసింహుడు చేయునదిలేక సైన్యమును ఉత్సాహపరచుచు వీరకేసరివలె శత్రువుల నెదిరించెను. కాని పులికేశునిధాటికి ఆగలేక శక్తిసింహునిసైన్యము పలాయనము చిత్తగించెను. చివరకు శక్తిసింహుడు పులికేశుని కరవాలమునకు ఎఱఅయ్యెను. రాజుమరణించిన వార్త తెలిసినవెంటనే సేనానియగు రఘువర్మ చిన్నవాడైన సునందుని తీసికొని పారిపోయెను. కుంతల రాజ్యమును శత్రువులు వశపరచుకొనిరి.

రఘువర్మ నొక మహారణ్యమును ప్రవేసించి అచ్చట నివాసమేర్పరచుకొని సునందుని అతిజాగ్రతగా పెంచుచుం

డెను, తనకున్న పాండిత్యమును, సమస్త రణవిద్యలును నేర్పెను. సునందుడును తండ్రినమించిన తనయుడై నా యరణ్యమున మృగములపాలిట యముడై అతి ధైర్య సాహసములకు నిలయమై పదునెనిమిది వత్సరముల వీరు డయ్యెను. రఘువర్మ సునందునికి అతని తండ్రిని చంపిన విధము, అతను కుంతలరాజ కుమారుడనియు చెప్పి, రాజ్యము పోయినది మొదలు తాముపడిన కష్టములు తెలిపి దీనికి ప్రతీకారముగా నాపులికేశునిచంపి నీరాజ్యమును వశ పరచుకొనమని ఉపదేశించెను. సునందుడు మాళవరాజు సహాయ మపేక్షించుటకై పయనమయ్యెను.

సునందుడు మాళవరాజ్యమును ప్రవేశించు నప్పటికి ఆరాజ్యమును కపిలవస్తురాజు ముట్టడించి యుండెను. సునం దుడు ఇదేసమయమనియెంచి తన యశ్వమును అతివేగ ముగా శత్రువులలోనికిపోనిచ్చి శత్రుభీకరునివలె తన కరవాల మునకుశత్రువులను బలిచేయుచుండెను. అకస్మాత్తుగావచ్చిన ఈ ప్రళయవీరునిధాటికి శత్రువులు తాళజాలక పిక్కబలము చూపిరి. అనుకోనివిధముగావచ్చి సహాయముచేసి తమరా జ్యమును నిలిపిన ఈ మహావీరునకు మాళవప్రభువు ఘన స్వాగతమిచ్చి తనకుమార్తెను వివాహము జేసికొనవలసి నదిగా కోరెను. సునందుడు తనతండ్రికి జరిగిన పరాభవ

మును, తనరాజ్యము పోయినవిధముచెప్పి ఆ దుర్మార్గుని హతమార్చుటకు నాకుసహాయము చేయవలసినదిగా కోరెను. ఈ మాళవప్రభువు అందుకు సమ్మతించి తనసైన్యమును సునందుని స్వాధీనమొనర్చెను.

దుర్బలుడైన కుటిలుడు పులికేశి నిద్రించు చుండగా వానినిచంపి రాజ్యమును తనస్వాధీన మొనర్చుకొనెను. ఎది రించిన ప్రజలను, అధికారులను అతిక్రూరముగా చంపిం చియు, ఏనుగులచేత త్రొక్కించుచుండెను. రాజ్యము అరా జకమై ప్రజాహితమును కోల్పోయెను.

సునందుడు మాళవసైన్యమును తీసికొని కుటిలునిపై దండెత్తెను. కుంతలరాజ్యములోని ప్రజలు తమ ప్రభువు వచ్చిన సంతోషముతో పురుషులూ, స్త్రీలుగూడా సునందునికి సహాయముచేయుటకు గుంపులు గుంపులుగావచ్చి చేరిరి. అయినప్పటికి కుటిలుడు వెఱవక సునందునితో మహాఘోర యుద్ధ మొనరించెను. ఈయువకసింహముముందు నాదుర్మా ర్గుడు ఎంతపోరినప్పటికి లాభములేక చివరికి సునందుని కరవాలమునకు బలియయ్యెను.

మాళవరాజు లావణ్యవతియు, సౌశీనురాలైన తనపుత్రిక యగు వసుమతినియిచ్చి సునందునకు అతివైభవముగా వివా హము చేసెను. మాళవరాజ్యమును, వత్సలరాజ్యమును,

కుంతలదేశమును నిర్విచారముగా, ప్రజలకు ఎట్టియిబ్బం దులు లేకుండా పరిపాలించెను.

---

## "దు రా శ"

అనగనగా పూర్వకాలమందు కాశీనగరములో చూడా కర్ణుడనే వర్తకు డుండెను. ఆయన కడు బీదవాడగుటచేత పరిసర గ్రామములకు తనుమోయగలిగినన్ని పప్పుదినుసులను తీసుకొనిపోయి విక్రయించి, దానిపై వచ్చు ప్రతిఫలముతో జీవనము గడుపుకొను చుండేవాడు.

ఒకరోజున 'నువ్వులు' బజారులో ధరపడిపోయి చౌకగా లభ్యమవుటచేత, మన చూడాకర్ణుడు ఒకబస్తానువ్వులు పది రూపాయలకుకొని యింటికి తీసుకొనివచ్చి నిల్వచేసెను.

చూడాకర్ణుడు గ్రామాంతరము వెళ్ళినసమయంలో ఇంటి వద్ద భార్య బస్తాలోని నువ్వులనుతీసి, బెల్లంకలిపి, దంచుకొని తింటూఉండేది - కొన్నిరోజులు గడిచినతరువాత, బజారులో నువ్వులకు ధర పెరిగిపోయింది బస్తా ఒకటింటికి వందరూపాయలవరకూ పెరిగింది - ఈసంగతి చూడాకర్ణుని చెవిని

---

రచన: పి. లక్ష్మణ్ రావ్

పడింది అమితానందంతో యింటికివచ్చాడు - తను ఇంటిలో నిల్వయుంచినబస్తాను ఒక్కసారి చూసుకుందామని ఆశతో వెళ్ళిచూశాడు - బస్తా అక్కడలేదు। భార్యనుపిల్చి "ఏమే। నువ్వులుబస్తా ఏమయింది?" అని ఆదుర్దాగా అడిగాడు.

భార్యగుండెల్లో రాయిపడింది, ఏమిచెప్పాలో అర్థంగా లేదు. నువ్వులకుబెల్లంకలిపి దంచుకొని తిన్నరుచితో బస్తా నువ్వులు ఎట్లా మాయమైపోయినవో ఆమెకే తెలియలేదు.

కాళీబస్తాచూచుకొని భర్తచాలా కంగారుపడ్డాడు - మళ్ళీ గద్దించి అడిగాడు 'ఏమైనవి అంటే, పలుక్కుండా అట్లా నిలబడి, నేలచూస్తావేం" అని చేయిపైకెత్తాడు భార్యను కొట్టే ఉద్దేశ్యముతో.

అందుకు భార్యహడలిపోయి "మరండి। మ - రండి। తి - నే - శా"-న - ం - డి అని చెప్పిచెప్పకమునుపే తనఆశ నిరాశ అయినందుకు కడుపుమండిపోయి ఆమెను చావచితక కొట్టి బైటకుగెంటి తలుపులు వేసుకున్నాడు. అప్పటికి రాత్రి షుమారు 9 గంటలవుతుంది - ఆమెకు ఎక్కడికివెళ్ళాలో అర్థంకాలేదు. దెబ్బలతో శరీరమంతా పచ్చిపుండుగా తయారైంది - బాధ ఎక్కువగాఉంది - అట్లానే నడవలేకనడుస్తూ దగ్గఱగాఉన్న కాళికాదేవాలయంలోకి వెళ్ళి దెబ్బలబాధతో మూల్గుతూ దేవిపాదాలపైన వ్రాలిపోయింది.

ఆరోజు రాత్రి షుమారు 12 గంటలకు మామూలుగా దేవి ఆలయానికివచ్చే గజదొంగలజట్టు ఆలయంలోనికి ప్రవేశించి "దేవీ ఈరాత్రికి మేము ఒకధనవంతునియిల్లు దోచుటకు వెళ్తున్నాం - మాపనిసఫలమైందా ! నీకు సగం వాటా యిస్తాం. తల్లీ మాకు జయాన్నిగలిగించు" అని ప్రార్థించు చుండగా, బాధతోమూల్గుతున్న చూడాకర్ణునిభార్య మూల్గుడు దొంగలకు వినిపించింది. వెంటనే వారు దేవి స్వయంగా "ఊ" కొట్టిందని అనుకున్నారు. అమితానందంతో బయలు దేరి వెళ్ళారు. దొంగలు వెళ్ళినపని పూర్తి చేసుకొని తిరిగి దేవాలయానికివచ్చి మాటయిచ్చిన ప్రకారం దోచుకున్న ఆస్తిలోసగం దేవిముందరపెట్టి వెళ్ళిపోయేరు. అప్పటికి తెలతెలవారుతూఉంది. చూడాకర్ణుని భార్యకు మెలకువ వచ్చింది. ఎదురుగాఉన్న బంగారునగలు మొదలైనవిచూచి తనకండ్లను తనే నమ్మలేకపోయింది. వాటినన్నిటిని ధరించు కున్నది. లేనిసత్తువతెచ్చుకొని వెంటనేలేచి యింటిముఖం పట్టింది - "ఏమండీ ! తలుపు తీయండి !" ఏమండీ ! తలుపు తీయండి" అని గట్టిగా తలుపుకొట్టింది -

లోపలనుండి 'పాడుపీనుగా ! మళ్ళీ యెందుకొచ్చావు ?' అంటూ తన్నటానికికాబోలు చూడాకర్ణుడు నిదరకండ్లతో తలుపుతీసి చాలాకోపంగా చూడబోయాడు. వెంటనే లేని నవ్వుతెచ్చుకుంటూ భార్యను యింటిలోనికి తీసుకొనివెళ్ళి

"ఈ బంగారునగలు యిన్ని ఎట్లావచ్చినయ్" అని ఆదుర్దాగా అడిగాడు.

అందుకు భార్య 'అంతా ఆకాళికాదేవి చలువ' అని మాత్రం చెప్పింది. అందుకు భర్త తనలో దేవిని ఒక్కమారు స్మరించుకొన్నాడు. అప్పటినుండి వారు హాయిగా కాలక్షేపం చేస్తున్నారు.

తలఁనితలంపుగా వచ్చిపడిన చూడాకర్ణుని సిరికి, యిరుగింటి సుమతికి వింతగాతోచింది. ఈ సంగతి ఎట్లాఅయినా తెలుసుకోవాలనే కుతూహలం గల్గింది. వారిది వంశపారంపర్యం బాగావున్నకుటుంబం. చాలపేరుగలధనికులు. భర్తకు చాలా ఆదాయంవస్తుంది. అంతటితో సుమతికి తృప్తిలేదు. పైగా ఒకరు బాగాఉంటే, ఆమెకు గిట్టదు. అందరూ తనకంటే తక్కువగా ఉండాలనే ఈర్ష్య ఈమెకు పుట్టుకతోనే ఉంది. నేతిబీరకాయవలె పేరుకు సుమతిగాని ఆచరణలో ఆమెకు సార్ధకనామము అసుమతి అయితే బాగుండుపోను. కాని సాధారణంగా పేరుకుతగ్గట్టు మనుష్యుల ప్రవర్తనఉంటుందామరి ? అందుకని మనచూడాకర్ణుని భార్యతో స్నేహం మొదలుపెట్టింది. రోజులు గడిచినకొద్ది ఆమెపై నమ్మకం గల్గించుకొన్నది. ఒకరోజున సుమతి చూడాకర్ణుని భార్యతో 'ఏమమ్మా ! ఓమాట అడుగుతాను ఏమనుకోవుగదా !

అన్నది. అందుకు చూడాకర్ణునిభార్య మామూలుగా పిలిచే ధోరణిలో "అడుగు పిన్ని, నీకు తెలియనిరహస్యమేముంది" అని సుమతి ముఖంలోకి ఆదుర్దాగాచూసింది, ఏమి అడుగు తుందోనని—

"ఆ! ఎమీలేదు, మొన్నటివరకూ మీపరిస్థితి చాలా బీదతనంగా ఉండేదిగదా! ఇంతలోనే యింత బంగారం ఎట్లా వచ్చిందా అని" — "కాని నీవు ఏమీ అనుకోకుండా ఉంటేనేచెప్పు, నేనేదో అడిగానులే" అంటూ తనకేమీ ఆవిషయమందు అంతగా శ్రద్ధలేనట్లు నటించింది.

ఆడవాళ్ళనోట్లో రహస్యం దాగదుగా! అంతటితో చూడాకర్ణునిభార్య రహస్యంగా నువ్వులుబస్తా దగ్గఉనుండీ, భర్తతన్ను చావమోది తలుపులువేసుకొన్న విషయమంతా చెప్పి - కాళీదేవాలయములోకివెళ్ళి తిరిగి నగలతోవచ్చిన సంగతంతా పూసగ్రుచ్చినట్లుచెప్పి - "పిన్నీ! ఎవ్వరితోను నీవు యీసంగతి చెప్పగూడదు, నీవూ నేను ఒకతల్లి పిల్ల లాగా ఉంటూఉన్నాం గనుక అరమరలేకుండా చెప్పేశాను."

"పైగా యిదికూడానా అమ్మా! నేను అలాచెప్పేదానినే, నీకుతెలియదు నాసంగతి" అంటూ, యిల్లా ఉత్రవుడియంగా వారికివచ్చిన భాగ్యానికి ఒకపక్క అనవసరముగా కుమిలి పోయింది. అప్పటినుంచే యిల్లా సునాయాసముగా భాగ్యం

ళావటము ఎలాగా అనే ఆలోచనాపరంపరల్లో పడిపోయింది-
ఆరోజురాత్రి నిద్రపట్టలేదు _ తెల్లవారింది - దురాశపుట్టింది -
భర్తబయటకువెళ్ళే సమయానికి సుమతి ఎదురుగావెళ్ళి 'ఒక
నువ్వులుబస్తా తెప్పించరాదండి' అని అసందర్భంగా యెకా
యెకి అడిగిన సుమతి కోరికకు భర్తకేమీ అర్థంకాక "అదే
మిటే అట్లా అడిగావు? బస్తానువ్వులు ఎందుకూ? వ్యాపా
రానికా? పంచిపెడతానికా" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.
అందుకు ఆమె "కాదండి, ఒకబస్తా తెప్పించండి" అని
మళ్ళా అడిగింది. ఏంపనుండి అడిగిందో అనే ఉద్దేశ్య
ముతో ఆరోజే ఒకబస్తానువ్వులు పంపాడు. నువ్వులు
యింటికొచ్చినదిమొదలు సుమతి వెంటవెంటనే వాటిని ఆవ
చేసింది - బస్తానువ్వులు పంజారాలు, పాడుచెయ్యటంతో
వారంరోజులలో అయిపోయినవనిపించింది. అవి అయిపోయే
వరకు నిద్రపట్టలేదు. వెంటనే భర్త దగ్గరకెళ్ళి 'ఏమండి!
నువ్వులుబస్తా ఏమైందే? అని అడగరేమండి' అని అన్నది.
అందుకు ఆమెభర్తకు ఏమీ అర్థంకాక, 'ఎందుకే అలా
అడగమంటావు' అని అన్నాడు.

"ఏమీలేదండి, అడగండి!" అని దీనంగా అడిగింది.
'సరే! నువ్వులుబస్తా ఏమైందే?' అని అడగమన్నట్లు
అడిగాడు.

"మరండి ! తి - నే - శా - నం - డి," అని సుమతి లేనిభయాన్ని తెచ్చిపెట్టుకుంటూ అన్నది.

అందుకు ఆమెభర్త 'తించేతిన్నావులే, ఏం తింటే ? ఇందులో మించుకుపోయిందేముంది - కావలిస్తే ఇంకొక బస్తాతెప్పిస్తా, తినెయ్యి' అంటూ మామూలుధోరణిలో నవ్వు కుంటూ వెళ్ళబోయాడు. అంతట సుమతి భర్తచేయి పట్టు కొని 'అదేమిటండి అట్లా అంటారు. అన్ని చెప్పాల్సిందే ? అంటూ "నన్ను కొట్టరేమండి" అని మళ్ళీభర్తను సంబో ధిస్తూ అన్నది.

అందుకు ఆయనకు ఏడవాలో, నవ్వాలో తెలియలేదు - వెంటనే లేనిసత్తువతెచ్చుకొని రెండుదెబ్బలు చిన్నవిగాచూచి వీపుమీద కొట్టాడు. అందుకు ఆమె 'అలాకాదండి, పెద్ద పెద్ద దెబ్బలుకొట్టండి.' అని మళ్ళా అన్నది - వెంటనే కర్ర వొకటి తీసుకొని సుమతికి దేహశుద్ధిచేశాడు. భర్తకొట్టిన దెబ్బలతో ఏడుస్తూనే 'నన్ను బయటకుగెంటి తలుపులువేసు కోండి' అని అంటూ తనే తలుపులువేస్తూ తొందరగా కాళికాదేవాలయాని కెళ్ళాలనే ఆదుర్దాతో బైటగొళ్ళెంపెట్టి వెళ్ళిపోయింది.

ఈతతంగం అంతా జరిగేటప్పటికి రాత్రిషుమారు 8 గం టల వేళైంది - వెంటనే అనుకున్న ప్రకారంవెళ్ళి కాళికా

దేవాలయం ప్రవేశించింది. మామూలు ప్రైంకు గజదొంగలు ఆలయానికి వచ్చారు. ప్రార్థన మొదలుపెట్టారు - అంతా వింటూవున్న సుమతి ఒక్కసారి "ఊః" అంటూ బెగ్గఱగా అన్నది - బెగ్గఱగా వినిపించిన ఈశబ్దం ఎక్కడనుండా? అని దొంగల ముఠానాయకుడు పరికించాడు. ఎదురుగా సుమతిగారు కనిపించారు. ఆమె వచ్చేటప్పుడు తనకు ఎప్పుడూ వంటిమీదఉండే నగలు తీసివేసిరాకుండా మర్చిపోయి పేరాశతో ఆలయం ప్రవేసిందిగాబోలు, ఒంటినిండా బంగారునగలతో దొంగలకంటపడింది.

వెంటనే "ఆడబోయినతీర్థ మెదురైందని" దొంగలు నెమ్మదిగా సుమతిని సమీపించారు - తలొకప్రక్క చెరారు - ఒంటినున్న బంగారమంతా తీసుకున్నారు - "జై కాళీ" అని చంకలుకొట్టుకుంటూ వెళ్ళిపోయారు.

అప్పటికి తెలతెలవారుతూంది. సుమతి తనకు జరిగిన అవమానంతో, దురాశకుపోయి తెచ్చుకున్న యీ పరాభవానికి మిక్కిలి దుఃఖిస్తూ యిల్లుచేరింది.

సంగతంతా తెలుసుకున్నభర్త సుమతికి తగినశాస్తి జరిగిందని బుద్ధిచెప్పాడు. గనుక దురాశ దుఃఖమునకుచేటు.



# కుక్క చూపిన పని

కుక్క విశ్వాసంగల జంతువని మనం వినివుంటాము. కాని ఒకకుర్రాడు తనుకుక్కకు విశ్వాసం కనపర్చవలసి వచ్చిందంటే తమాషాగా లేదూ? మరి, ఆకథ వినండి.

రోశయ్యఅనే కుర్రవాడు బిచ్చమెత్తుకొని జీవించేవాడు. వాడికి అదేఅలవాటయి, ఏపనీచెయ్యక, సోమరివాడయ్యాడు వాడు చిన్నతనంలో పాఠాలు చదవకపోవటంచేతనూ, బడికి వెళ్ళకపోవటంవల్లనూ ఈగతిపట్టింది. తల్లిదండ్రులు చని పోయ్యేటప్పటికి వాడికి అడుక్కుతినటమే గతైంది. వాడిని మంచిదారిలోకి పొమ్మనిచెప్పేవా రెవ్వరూ లేకపోయారు.

ఒకరోజున వర్షంలో వాడు ఒకసత్రం అరుగుమీద వెచ్చగా ముడుచుకొని పడుకునివుండగా, ఒకకుక్కపిల్ల వానకితడిసిపోయి వాడిదగ్గర కొచ్చింది. ఆరోజుమొదలు ఆకుక్కపిల్లే రోశయ్యను ప్రేమగా పెంచసాగింది. దాన్ని పెంచటానికి వాడిదగ్గరేముందీ? "బుల్ బుల్" అని పేరు మాత్రంపెట్టగలిగాడుదానికి. అదివాడిచుట్టూ తిరుగుతుండేది. ఆప్రక్కనే శివాలయంలో లింగానికి రోజూ పాలు అభిషేకం చేసేవాళ్ళు. సరిగ్గా ఆ అభిషేకంవేళకు ఆకుక్క గుడినుండి బయటకువచ్చే అభిషేకపుపాలనుకాస్త త్రాగుతూ, రోశయ్య దగ్గరకి చేరుకునేది. అది పెద్దదయినతర్వాత దానికి పాల

---

రచన: "శా ర ద"

---

అవసరంతీరింది. ఎక్కడ ఏదిదొరికితే అదితిని కడుపునింపుకునేది. ఇలాఉండగా రోశయ్య "బుల్ బుల్"కు ఒకపని తగిలించాడు. ఎక్కడో ఓబిచ్చగాడు తనకుక్కనోటికి చిన్న బుట్టలాంటిది తగిలించి బిచ్చమెత్తిస్తున్నాడు. బియ్యం, డబ్బులు, కాయలు ఎవరికితోచిందివాళ్ళు కుక్కనోటికిఉన్న బుట్టలో వేస్తున్నారు. దీన్నిచూచినరోశయ్య తనకుక్కతో గూడ ఈ ప్రకారంచేయిస్తూ సోమరిలాగ కాలంగడపాలని చూచాడుపాపం. కానితనకుక్క అందుకుసమ్మతించక కాబోలు రోశయ్యతగిలించినబుట్టతో రైలుస్టేషన్‌కుదారితీసింది. ఎందుకలాతన్ను ఆవైపుకుతీసుకెళ్ళుతుందాఅని రోశయ్యకుమొదట అవగాహనకాలేదు. అచ్చట ప్రయాణికులందర్నీ ఒకసారి తేరిపారచూశాడు రైల్వేకూలీలు సామానులు ఎత్తుకొనివెళ్లటం, లోపలినుండి తీసుకొనిరావటం అందుకు ఆప్రయాణీకులిచ్చే కూలిడబ్బులు అన్నిచూశాడు. ఈపని తనకుఎంతైనా బాగుందని తలచాడు మరుసటిరోజే రైల్వేకూలీగా చేరాడు. రోజూవచ్చే కూలితో హాయిగా కాలంగడుపుతూ సుఖంగా వున్నాడు. ఇదంతా తన 'బుల్-బుల్' చూపిన పనియేనని, దానిని ప్రాణంతో సమానంగా చూచుకుంటూ దానియందు ఎంతో విశ్వాసంగావుండేవాడు. తనకురోజూవచ్చే కూలిడబ్బులతో తనకుక్కకు పాలు, రొట్టె కొనిపెట్టేవాడు.

మంగళమ్.



డందులకుఁ మిగుల సంతసించి సంతాన మొసగఁగలడు". అన వినినంతనే బ్రహ్మనాయఁడు మిగులసంతసించి వ్రతమాచరించు విధానము తన ధర్మపత్ని కెఱింగించెను.

ఐతాంబయు భూదేవు లెఱిఁగించిన తెఱంగున సంవత్సరకాలము తదేకనిష్ఠతో గజనిమ్మవ్రత మాచరించెను. కడపటిదినమున నామె యా నిమ్మపండ్లను బంగరుపళ్లెరమున నునిచి, కుసుమచందన ధూపదీప నైవేద్య తాంబూలాదులఁ గైకొని, విప్రకామినులును, చెలికత్తియలును వెంటరా, వివిధ వాద్యముల మ్రోతలు మిన్నుముట్ట, వేశ్యకాంతలు నాట్యమాడ, శ్రీ చెన్నకేశవ దేవాలయమున కేఁగెను. పూజారు లరుదెంచి స్వామిని జూపరులకుఁ జూపిరి. ఐతాంబ జంబీరఫలములఁ జెన్నని కర్పణసేయ, నాస్వామి విముఖుఁడాయెను. వత్సరమునుండియుఁ దాఁ జేసిన కృషియంతయు వృథయయ్యెఁ గదాయని ఐతాంబ మిగుల దుఃఖించి యనేక విధముల నా దేవదేవుని స్తుతించెను. అటు లైతాంబ చెన్నకేశవుని మిగుల భక్తితో నిశ్చలాత్మయై కొంత తడవు నుతింపఁ గడకా మహామహుఁడు పూజారి నావేశించి వానిచేత నిట్లని పలికించెను. "ఓ సాధ్వీ! నీ పూజ కత్యంతానందముఁ జెందితిని. నీ భక్తికి సంతసించితిని. నీ నిశ్చలత్వమున కచ్చెరు వొందితిని. కాని నీ మది నిబ్బరమింకను బరీక్షింప నిట్లొనర్చితిని. నీకు త్వరలో సుపుత్రుఁడుదయింపఁగలడు. ఇదిగో! గైకొమ్ము" అన దోసిలి యొగ్గియున్న ఐతాంబ కరములయం దెచ్చటినుండియో యొక జంబీరఫలము పడెను. ఐతాంబ మిగుల నాశ్చర్యము నొంది లోలోన మిగుల సంతసించి తనకును, తన చెలికత్తెల

కును సద్దానిని బంచియిమ్మని యొక విప్రకామినిని గోరెను. ఆ యమయు నా నిమ్మఫలము నెనిమిది సమభాగములుగఁ జేసి, నాయని భార్యకును, నామె చెలికత్తెలకు నొసంగి, తానొక భాగము భుజించె. పిమ్మట స్వల్పకాలమునకే యందఱు గర్భములదాల్చి సుపుత్రులఁగనిరి. వారిలో ఐతాంబ కుద్భవించిన బాలుఁడే మన కథానాయకుఁడగు బాలచంద్రుఁడు.

## —♦ బాల్యము - వివాహము ♦—

బాలచంద్రుఁడు జననమొందినప్పటి నుండియుఁ దల్లి దండ్రులచే నల్లారుముద్దుగఁ బెంపఁబడు చుండెను. కుమారుఁ డొక్కఁడే యగుటచేతను, లేక లేక గలిగినందుల చేతను బ్రహ్మనాయఁడును, ఐతాంబయు "పెన్నిధిగన్న పేదచంద మున" మిగుల బ్రేమతోఁ బెంచుచుండిరి. బాలుఁడును శుక్ల పక్ష శశాంకుని పగిది దినదినప్రవర్ధమానుఁడగుచు, నందఱకు ముద్దులు మూటగట్టుచుండెను. బాలచంద్రుఁడు క్రమక్రమ ముగ బెరిగి పెద్దవాఁడగుచుండెను. ఆటపాటలయం దసమా నుఁడై తోడి బాలురలో నగ్రగణ్యుఁడయి యుండెను. పంచవర్షప్రాయుండగుటెఱింగి నాయఁడు బాల నాయనికి విద్యాభ్యాసము చేయింప నుద్యమించుచుండెను.

ఇటులుండ నాయఁడొకనాఁడు జ్యోతిష్కులకుఁ దన కుమారుని జాతకముఁజూపి రాఁబోవు ఫలములఁ దెలుపుఁడని కోర, శాస్త్రయుక్తముగ నాకార్తాంతికులు బాలుని జాతక మును పరిశీలించి "స్వల్పకాలములో బాలునిమూలమున నీకు

ప్రాణహాని సంభవింపఁగలదు" అని నాయనితోఁ బలికిరి. ఆ పలుకులు వినినంతనె నాయఁడు దిగ్భ్రమజెంది మాఱు మాటాడక కుమారుని జంపిన తనకుఁగలుగఁబోవు కష్టములు దప్పునని యెంచి మాలకన్నమదాసునకు బాలచంద్రు నిచ్చి యడవుల వధించి రమ్మని పంపె. కన్నమయు దూరమాలోచించి, బాలచంద్రునిఁ జంపకయే, నాయని తమ్ముఁడగు పేరినాయని గేహమున నునిచెను. అతఁ డబ్బాలుని రహస్యముగఁ బెంచుచుండె. కొంతకాలమువఱకు బాలుఁడు జీవించి యుండుట నెవరును నెఱుఁగరయిరి.

ఇట్లుండఁ గొంతకాలమునకు బాలచంద్రుఁడు జీవించి యుండెనని బ్రహ్మనాయనికిఁ దెలిసి యాతనిని జంపిరమ్మని మరల నాజ్ఞాపించె. బంధువులు, స్నేహితులు, పౌరులందఱు నేకగ్రీవముగ బాలునియం దేదోషము లేదనియుఁ దప్పక స్వీకరింపుమనియు, నాయనిఁ బ్రార్థింప నతఁడంనుల కియ్యకొని, మరల బాలునిఁ గైకొని, యుక్తకాల మగుఁడు నాతనికి గండు కన్నమనాయని తనయయగు మాంచాలాంబ నిచ్చి యొక సుముహూర్తమున వివాహమహోత్సవము జరిపె.

బాలచంద్రుఁడు తండ్రినిమించిన కొమరుఁడు. మిగులఁ బరాక్రమశాలి. పౌరుషవంతుఁడు, ప్రతిజ్ఞాపాలకుఁడు. అర్జునునకు సాటియగు విలుకాఁడు. పెద్దనాయని కీడగు నశ్వవిద్యావిశారదుఁడు. తండ్రినిబోలిన యాలోచనాపరుఁడు. అభిమన్యున కీడగు వీరుఁడు. పలనాటి వీరులలో నగ్రగణ్యుఁ డనదగిన సర్వలక్షణ లక్షితుఁడు. సౌందర్యము నవలోకించినఁ దుమ్మెద ఱెక్కల చాయ మించిన ముంగురులును, సంపంగి మొగ్గం

బోలు నాసికయుఁ గమలములఁబోలు కన్నులును, వింటిని బోలు కన్బొమలును, నూనూగు మీసములును, నాజాను బాహువులును, విశాల వక్షమును, గంభీర విగ్రహమును గలిగి రూపమునఁ బుష్పబాణుని మించియుండెను. ఇట్టి బాల చంద్రుని యాటపాటలయందు, గలసి మెలసి సోదరులవలె సంచరించుచుండు, బ్రాహ్మణ అనపోతు, వెలమ దొర్నీఁడు, చాకల చందన్న, మంగల మంచన్న, కుమ్మరి తేర్కుఁడు, కంసాలి చంద్రన్న యను నార్గురు మిత్రులు గలరు. బాల చంద్రుఁడు వీరందఱిలో నగ్రగణ్యుఁడు. బాలుఁడు మంత్రి పుత్రుఁడైనను, అనుజులబోలు తన మిత్రసమితిచే రాజ పుత్రుని కన్న నెక్కుడుగ గౌరవింపఁబడెడివాఁడు. అగ్రజుని కన్న నెక్కుడుగఁ బ్రేమింప బడువాఁడు.

## —♦ బాలచంద్రుని క్రీడావినోదములు ♦—

ఇట్లు కొంతకాలము గడువ నొడంబడిక ననుసరించి, బ్రహ్మనాదులు గడుపవలసిన సప్తవర్షంబులు మేడపియందే గతించెను. అందుచే నాయఁడు 'అలరాజును' నలగాముని వద్దకు రాయబారిగ నంపుచు, దమ మాచర్లభాగము దమ కిమ్మనికోర, నలగామరా జందుల కంగీకరింపకుండుటయేగాక, మీఁదుమిక్కిలి మాయోపాయంబులచే, దౌత్యమున కరి గిన అలరాజును విషభోజనముచేఁ జంపించెను. అందుచే సంధి కుదురుట కడుదుర్లభంబని నాయఁడెంచి, యుద్ధముచేయుటయే కర్తవ్యంబని తలఁచి కడ కావార్త నలగాముని కెఱింగించి బ్రహ్మనాదులందఱు కార్యమపూడి రంగమున కేఁగుచు,

నంతఃపురాంగనా సంరక్షణార్థమై, బాలచంద్రాది బాలవీరుల నందఱ వీర మేడపియందే యుంచిరి.

రణరంగమున కేగకుండుట బాలవీరుల కిసుమంతయు మనసొప్పకుండె. అయినను బెద్దలమాట కెదురాడక బాలచంద్రాదు లందఱు మేడపియందేయుండి క్రీడావినోదంబుల నోల లాడుచుండిరి. ఇట్లుండ బాలచంద్రుఁ డొకనాఁడు బొంగరముల నాడ నుద్యుక్తుండై జననికడ కేగి, బంగరు బొంగరముల జేయింపుమని గోరెను. తల్లి, యాయాట వల దనియుఁ దన్మూలమున నెవరి కేకీడు మూడునోయనియుఁ జెప్పి నాఁటినుండియు దన కుమారుని మఱలింప ననేక ప్రయత్నము లొనర్చెను. బాలుఁడంగీకరింపక కడ కిట్లనియె :-

"జననీ ! నేను దుష్టస్వభావముగాని, ధూర్తలక్షణము గాని గలిగినవాడను గాను. పరభామినులయెడ మాతృభావమున సంచరించువాఁడనే గాని యన్యాలోచనలుగల దుర్మార్గుడను గాను. తల్లీ! నేవచ్చి చాల తడవాయెను. వైళంబ మదీయ వాంఛిత మీడేర్చి పనుపుము".

అందుల కైతాంబ పుత్రమోహంబున బాలునికోరిక రిత్త పుచ్చఁ దలఁపక తత్క్షణ మొక కంసాలిని బిల్వనంపి యాతనిచే బంగారు బొంగరములఁ జేయించి తనయున కొసంగె. బాలుఁ డందుల కెంతయు సంతసించి, బొంగరముల గైకొని తన మిత్రబృందము వెంటరా, తత్క్రీడాసక్తుఁడై నిర్ణీత ప్రదేశమున కేఁగెను. బాలుఁడు బొంగరములాడఁ బోవుచుండె నను వార్త యాయూరి యాబాలగోపాలమునకుఁ దెలియుట

చేత, నద్దానిని గాంచుట కనేకు లచటి కేఁగుచుండిరి. అందు జోవుచున్న స్త్రీలలో 'అన్నమ' యను వైశ్యకాంత నూతన వస్త్రాలంకృతయై, యత్తమామల యనుజ్ఞఁబడసి తనస్నేహితురాలగు నొక విప్రకామిని వెంటరా, క్రీడారంగమున కేఁగెను.

బొంగరముల యాట ప్రారంభమాయెను. బాలచంద్రుఁడు తన బొంగరము ననేకవిధములఁ ద్రిప్పుచు, మిత్రుల నోడించుచుఁ, జూపరుల కత్యుత్సాహము కలిగించుచుండెను. ఇట్లు బాలుఁడు బొంగరము లాడుచుండఁ దటాలున నాతని బొంగరము రివ్వునవచ్చి క్రీడా వినోదంబులఁ దిలకించుచు, నేమరపాటున నున్న యన్నమ పాదమునఁబడి గ్రుచ్చుకొనియె. ఆయమ యాబాధ నోరువఁజాలక అయ్యో! అయ్యో! యనుచు నేలం గూలెను. చూపరులెల్లరు హాహాకారము లొనర్చిరి. బాలచంద్రుఁడు తత్క్షణంబ యాట విరమింప నియమించి, వైశ్యకామిని కడకరిగి యాయమ కనేక శైత్యోపచారములఁ జేయుచున్నంతలో నా వైశ్యకామిని తెప్పిరిలి:

"ఓరి దురాత్ముఁడ! ఓరి దుర్మార్గ! క్రిందుమీఁదెఱుఁగక మిడిసిపడుచున్నాఁడవు. పరస్త్రీలయెడ నీకింత యదరిపాటేల? నీవు మహదైశ్వర్య సంపన్నుఁడవే యగుదువుగాక! ఉండిన దినవలయు, గట్టవలయు; నంతియకాని పరభామినుల యెడ నిట్టి యకృత్యము లొనర్పఁజెల్లునా? మదముపట్టిన గిత్త వలెను, పోతుసింగముమాడ్కి బలిసియున్న నీవు పిటికిపందవై యాఁడుదానివలె నింటనుండి, అబలలమగు మా యెడలనా నీపౌరుషముఁ జూపుట! దుర్మార్గ! కార్యమపూడి రణరంగమున మలిదేవాదులును, నీ తండ్రియును, లెక్కకు

మిక్కిలియగు ఇతర వీరాధివీరులును, శత్రువులతోఁ బోరు చుండ, ఆఁడుదానివలె కరములకు కంకణముల దొడిగికొని, యింటనుండి యిట్టి యమానుష చర్య లొనర్చుచేనా నీ మగ టిమి ? తులువా! ఇప్పటికైన నీ కర్తవ్యమూహించి, కదన రంగమున కుఱికి నీ పరాక్రమము జూపుము".

అని పరుషోక్తుల నాడె. బాలచంద్రుఁ డా పలుకు లన్నియు హితోక్తులుగ నెంచి, యావంతయు గోపింపక, క్షమింప నా తరుణీరత్నమును బ్రార్థించెను. బాలుఁ డానాఁ డంతటితో నాట చాలించి గృహమున కేఁగెను.

ఆ నాఁడు అన్నమ పలికిన పలుకులు బాలచంద్రుని హృదయమునకు వాఁడి ములుకులవలె గ్రుచ్చుకొని బాధించు టచే "జనకు లా తెలుఁగునఁ గదనరంగమునకుఁ బోవ నాఁడుదానివలెఁ జేతులఁగట్టుకొని యింటనుండుట పౌరుష లక్షణముగా"దని యెంచి కదకు రణరంగమునకుఁ బోవ నిశ్చయించి , తన మనోవాంఛితము జనని కెఱుకపఱచెను. ఐతాంబ బాలుని మాటలు విని కడుఁ జింతించి, బాలచంద్రుని కాలని జన్మప్రకారంబును విశదీకరించి "కుమారా ! ఎన్ని నోములనో నోచి, ఎన్ని వ్రతములనో యాచరించి,ఎన్ని దాన ములనో యొసంగి, యష్టకష్టములఁబడి యా చెన్నకేశవుని యనుగ్రహంబున నిన్నుఁబడసితిని. నాటినుండి నేటివరకు గంటికి గన్నాకు తెలంగున, నొక్కనిముసమేనియు నిన్నెడ బాయక కడుగారాబంబున బెంచుకొనుచుంటిని. నిన్ను నే గానని యొక్కనిముస మొక్కయుగముగ నాకు దోచెడిని. చంద్రబింబము నతిక్రమించు నీవదనమండలము గాంచి

నంతనే యెంతటి మనోవిచారమైనను దొలంగి నేనానంద సాగరమున నోలలాడుచుందును. తనయా! లేక లేక గలిగిన కన్నకడుపును కదనరంగమున కనిపి, నేనెట్లు జీవముల నిలుపు గొందును? వయసుననా పిన్నవాఁడవు! జనకుఁడా దాపున లేఁడు. చేయబోవునదియా వీరాధివీరులతోడి యుద్ధంబు. ఇట్టి సమయమున నీవు రణరంగమున కేఁగుటబాడియా?" యని పలికి బాలచంద్రున కాతని జన్మప్రకారంబును విశదీకరించి శోకించగా,

బాలచంద్రుఁడిట్లనియె: "తల్లీ! నాతండ్రి మొదలగు వీరులందఱు కార్యమపూడి రణరంగమున యుద్ధముఁ జేయుచుండ, నాఁడుదానివలెఁ బిఱికి పందనై, చేతులకు గాజులఁ దొడిగికొని యింటనుండుమనియేనా నీవు చెప్పునది! ఆహా! జననీ! నీవు వీరమాతవుగాదా? వెలమకులోద్భవుండగు గండు కన్నమనాయని సోదరివి గాదా? బ్రహ్మనాయని యర్ధాంగివిగాదా! ఇవియేనా నీవాడవలసిన పలుకులు? మఱియు నీ కార్యమునకు మిగులఁ బ్రోత్సహించి, యలనాఁడు పాంచాలి నభిమన్యుని 'శత్రువుల మూఁకను జెండాడి, విజయలక్ష్మిఁగైకొనిర'మ్మని యాశీర్వదించి పంపిన తెఱంగున, నన్నును వైశంబ పనుపుము. పౌరుషవంతులగు మావంశజుల రక్తము నా శరీరమున బ్రవహించుచున్నంత దనుక నూరక నిఁక గృహమున నుండనొల్లను. మఱియు వినుము.

"జననీ!. నీ వెఱుంగని ధర్మంబులు లేవు. మానవుని శరీర మశాశ్వతమైనది. భాగ్యభోగములు క్షణభంగురములు. షట్చక్రవర్తులాదిగాఁగల భూపతు లెన్నఁడో కాలధర్మము

నొందినను శాశ్వతముగ నిల నిప్పటికినిఁ బాడఁగట్టునవి వారి యశశ్చంద్రిక లేగదా! మానవుఁడు రాజభవనమునందుండు గాక, నట్టడవియం దుండుగాక, వానికి మరణంబు తథ్యంబు. తల్లీ! పరాక్రమోపేతుఁడగు బ్రహ్మనాయని కుమారుఁడ నయి, వీరమాతవగు నీ గర్భమున జనియించినందుల కిట్టి సమయంబున కార్యమపూడి రణరంగంబు జొచ్చి మదీయ బలపరాక్రమంబులు మెఱయ, శత్రుమూఁకలఁ జెండాడి శాశ్వతకీర్తి బడయుటయే మదీయ కర్తవ్యంబని నీ వెఱుఁగవా?"

అని బాలచంద్రుఁ డనేక విధంబుల వీరధర్మోపన్యాసంబు లీయఁ గడ కావీరమాత "మాంచాలఁ జూచి మఱిపొ"మ్మని యనుమతించె.

బాలచంద్రుఁడు జననియాజ్ఞవడసి, తనసోదరబృందము వెంటరాఁ గొంతసైన్యముగూడ వెంటనిడికొని, మాంచాలాగృహాభిముఖుఁడై చనెను. శ్వశురగృహమున కేఁగినంతనే "గండు"వారెంతయో అతిథులను గౌరవించిరి. మిత్రుల నందఱ నొక ప్రదేశముననుంచి బాలుఁడు మెల్లన మాంచాలావరోధముం బ్రవేశించెను. మాంచాలయుఁ బతినిగాంచినంతనే సంతోషస్వాంతయై కుశలప్రశ్నలడిగి, తన నాథుని రాకకుఁగల కారణంబెఱిఁగి యిట్లనియె. "రణరంగమున కేఁగుటకు వెనుకంజవేయకుఁడు. ఇచటగల స్త్రీలకేహానియు వాటిల్లదు. అంతఃపురస్త్రీల రక్షించుటకును, బట్టణమును శత్రువుల బారి నుండి రక్షించుటకును, బురుషవేషధారిణినై, దమకు మారు నేనిచట నుంటినని మరువకుఁడు. పురుషవేషధారిణినై, నానేర్చిన యస్త్రవిద్యా నైపుణ్యంబున శత్రువులమూఁకల జెండాడు

దును. అలరాజును జంపిన నరసింగును, విగతశరీరుని జేసి ప్రతిజ్ఞా పాలకులు కండు.

మఱియు నో మనోహరా! మీరు రణరంగంబున వైన తేయున కీడగు జవసత్వంబులును, పవననందనుని మించిన సాహసంబును, శ్రీకృష్ణునకు దీసిపోని కీర్తియును గలిగి, భాస్కర తేజఃపుంజము భాతి ప్రకాశించి యలరాజును జంపిన దుష్టులకదన రంగమున జీల్చి, విజయలక్ష్మిగై కొందురుగాక!" అని దీవించి, ఖడ్గరాజం బొండొసంగి యా వీరపత్ని బాలునిఁ బంపె.

## బాలుఁడు కార్యమపూడి కేఁగి యుద్ధముఁ జేసి వీరస్వర్గము చేరుట.

బాలచంద్రుఁడు తన సహధర్మచారిణిని వీడి, నిజ గృహంబునకుఁ జని, జననివలన నాశీర్వాదములఁ బడసి, తన మిత్రబృందము, సైన్యము వెంటరాఁ, దానొక పొట్టేలునెక్కి, కార్యమపూడి రణరంగమునఁ బ్రవేశించె. అంత నిరువైపుల వారలకు రాయబారములు జరుగుచుండె ననువార్త బాలుని శ్రోత్రపుటంబులఁ బడినంతనె ప్రయాణ ప్రయాసము నైనఁ దీర్చుకొనక, ఱివ్వున నా స్థానమునకుఁ జని, యాతనిపక్షంబున నున్న వీరులకెల్లరకుఁ బౌరుషము గలిగించి యుద్ధమునకుఁ బురిగొల్పి సంధి పొసఁగకుండునట్లు చేసె.

మఱునాఁడే యుద్ధము ప్రారంభమాయెను. ఇరుపక్షముల యోధులును బాహాబాహి, ముష్టాముష్టిఁ బోరాడుచుండిరి. ఆ రంగమంతయు నెత్తుటికాల్వలతోడను, క్షతగాత్రములతోడను, శవముల కుప్పలతోడను, నస్త్ర శస్త్రముల

తోడను నిండి సామాన్యజనులచూపులకు మిగుల భయము గలిగించుచుండెను. బాలచంద్రుఁడు తండ్రికి నమస్కరించి, యావీరపుంగవుని యనుజ్ఞ వడసి తానీవఱలో "అలరాజును జంపిన నరసింగుని యుద్ధమునఁ జంపెద" నన్న ప్రతిజ్ఞఁ బాలించుటకొఱకు, వలయు కొంత సైన్యముఁ దీసికొని అలనాఁడా సుభద్రతనయుఁడు కదనరంగమున కుఱికినట్లు కొదమసింగమువలె గర్జించుచు, సింహనాదంబు సేయుచు యుద్ధమునకు బయలువెడలెను. నరసింగుండును బాలుని యట్టహాసంబు దూరమునుండియే చూచుచు, 'బాలుఁడే గదా' యని తొలుత నాతని డీకొన తలపెట్టక పోవుచున్నతఱి బాలచంద్రుఁడు త్రుటికాలంబున నరసింగుని సైన్యముల చెల్లాచెదరు గావింప, నరసింగుడా బాలవీరుని ధాక కోరువఁజాలక పలాయనమయ్యె. అంతలో నొక వీరుఁడు బాలు నెదుర్కొను టను జూచి, పొరఁబడి యాతఁడే నరసింహుఁడని తలఁచి, నిమిషంబున నాతని శిరంబు ద్రెళ్ళనేసి, యద్దానిఁ దెచ్చి జనకుని పాదకమలములందుంచె. నాయఁడది నరసింగునిశిరంబు కాదని పలుక బాలుఁడు మిగుల లజ్జజెంది, వైళంబ కదనరంగమున కుఱికి నరసింగుఁడున్నచోటెఱింగి, పోయి యాతనిఁ గ్రుటికాలంబునఁ తుతగాత్రునిఁగావించి తచ్ఛిరంబు బ్రహ్మనాయనికిఁజూపె.

బాలుని పరాక్రమమునకును, ప్రతిజ్ఞాపాలనమునకును నెల్లరు మిగుల శ్లాఘించిరి. కాని మడియింపఁబడిన నరసింహునిఁజూచి మిగుల దుఃఖించిరి. అయ్యది బాలచంద్రుఁడు గని బ్రహ్మనాయని పౌరుషవాక్యములతో నిష్ఠురములాడెను. అందులకు బ్రహ్మనకోపించి "విమతులకు వెన్నిచ్చి వచ్చిన

నీయట్టి ధీరుఁడనుగాను" అనియెను. బాలుని శ్రోత్రపుటముల కయ్యవి వాఁడిశరంబులవలెనాట, వైళంబ సైన్యసమేతుండై రణరంగమున కుఱికి, తనకుఁగల రణవిద్యా పాండిత్యము నంతయుఁజూపి, శత్రువుల ననేకులఁ జెండాడి, పద్మవ్యూహమునఁ జిక్కి వీరస్వర్గము నొందిన యభిమన్యునిమాడ్కి శత్రువుల మూఁకలచేఁ జుట్టఁబడి కార్యమపూడి రంగమున నసువుల బాసి స్వర్గలోక మలంకరించె.

—o—

# 5. అలరాజు

పూర్వము కల్యాణపురమును 'వీరసోముఁ' డేలుచుండెను. అతనికుమారుఁడు కొమ్మరాజు. అలరాజు కొమ్మరాజు తనయుడు. 'రాచమల్లుఁ'డను నామాంతర మతనికిఁ గలదు. అతని తల్లి చెల్లమదేవి. భార్య రత్నాలపేరమ్మ. అతఁడు పల్నాటి ప్రభువగు నలగామరాజున కల్లుడు. రాచమల్లుఁడు శైవమతస్థుఁడు. కొమ్మరాజు చెలియలినే పెదమలిదేవున కిచ్చి వివాహముచేసిరి. అందుచేఁ గొమ్మరాజు, అలరాజు మొదలగువారందఱు మాచర్లయందే యుండిరి.

రాచమల్లుఁడు మిగులఁ బలపరాక్రమశాలి. ఎంతటి బలవంతునైన నవలీలగ నణఁగ ద్రొక్కెడివాఁడు. అతని బాహుపరాక్రమమును వినియే,నలగాముఁ డాతని కుమారిత నొసంగెను. అలరాజునకు "నవరాలగోడిగ" యను నశ్వరాజమొండు కలదు. అది అలరాజునకు మిగుల నుపయుక్తముగ నుండెడిది. బ్రహ్మనాయని అన్న బాదరాజు. బాదన్న

కొక ఘోటకము గలదు. అది 'కారుబొల్లఁడు' అని పిలువ బడుచుండెడిది. రెండు గుఱ్ఱములకును కాపరులు కలరు. వారిరువుర కొకానొక కారణమునఁ గలహము సంభవించెను. వారిమూలమున బాదరాజు, అలరాజు, ఇరువురు 'చంద్ర వంక' నదియొడ్డున ఘోరయుద్ధముఁ జేసిరి. ఆవృత్తాంతము బ్రహ్మనాయనికిఁ దెలిసెను. వెంటనే, వారిరువురకుఁగలపోరు సమసెను. కాని మనస్పర్థలు వీడలేదు. సమయము దొరకిన యుద్ధముఁ జేయవలయునని యొండొరులు గాచుకొనియుండిరి.

బ్రహ్మనాదులు 'వీరమేడపి' యందుండి, ఒడంబడిక ననుసరించి సప్తవర్షంబులు గడిపిరి. వారందులకు నలగాముని కడకొక రాయబారిని బంపదలఁచిరి. కాని రాయబారి దొరకుట గడుదుర్లభమాయెను. ఇరు కక్షలవారలకు బంధువగు వానిని బంపిన కార్య మనుకూలమగునని యెల్లరును దలఁచిరి. అక్కార్యమును సాధింపఁగల సమర్థుఁడు "అలరాజు" కన్న మఱొక్కరుఁడు గానరాఁడయ్యె. అందుచే బ్రహ్మన కొమ్మరాజు కడఁకేగి, విషయము విన్నవించి తన కుమారుని దూతగఁ బంపుట కంగీకరింపుమని ప్రార్థించెను. అలరాజున కపాయము గలుగఁగలదని యాతఁడు భావించి, కోటకేతుఁడు కుమారునిఁ బంపుట కంగీకరింపకుండెను. నాయఁడు పట్టిన పట్టు వీడక, బాలుని రక్షించుభార మతనిదని నొక్కి-వక్కాణించెను. కడకు కొమ్మరాజు "నాభార్య యంగీకరించినఁ గొనిపొమ్ము" అనెను.

పిమ్మట బ్రహ్మనాయఁడు చెల్లమ దేవికడకేఁగ నామె నాయని రాకకు మిగుల నచ్చెరువందెను. కారణమూహిం

చెను. నాయఁడెంత బ్రతిమాలినను, ఆమెయు నంగీకరింప లేదు. పెద్దన్నకు,అలరాజునకు జరిగిన చంద్రవంక యుద్ధసందర్భమునను, అలరాజు శైవమతస్థుఁడు, నాయఁడు వైష్ణవమతస్థుఁడు అగుటచేతను, రాచమల్లునియందు నాయని కీర్ష్యగలదని యామె మూఘాభిప్రాయము! అలరాజునంత మొందించుటకే నాయఁడట్లు చేయుచున్నాఁడని యామె వెఱ్ఱియూహ. నాయఁడు అలరాజును పంపకున్న అనుఁగురాజునకు, మలిదేవులకు యుద్ధము తప్పదనియు, తన్మూలమున బంధునాశన మగుననియు, రాజ్య మరాజక మగుననియు చెప్పి, చెల్లమ్మ నంగీకరింపఁ జేసెను.

ఆవల అలరాజు తనగుఱ్ఱమునెక్కి రాయబారమునకు బయలుదేఱెను. అతఁడు తన యశ్వము ననేకాభరణములచే నలంకరించెను. మరియు నాతనికి శూదరాజునందుఁగల కోపముచే నతనికిమాఱు, చిన్న ప్రతిమ నొకదానినిఁ జేయించి గుఱ్ఱము ముఖమునకుఁగట్టెను. ఈసంగతి మలిదేవులకుఁదెలిసి యట్లుచేయుట బాదన్న నవమానించుటకే యని తలంచి యెటులైన దానిని గొనిరమ్మని బాలచంద్రుని బంపిరి. బాలుఁడు అలరాజుసు సాగనంపుటకు బయలుదేఱెను. ఇరువురును, సల్లాపములాడుకొనుచుఁ బోవుచుండ మార్గమున నొక వాగు వెల్లువలయి ప్రవహించుచు, మార్గస్థులకు మిగులఁ బ్రతిబంధకముగనుండెను. బాలుని వాహనముపొట్టేలు. అపుడు "ఎవరి వాహనము ఒక్కగంతులో ఆవలియొడ్డునకు తన యజమానునిఁ దీసికొనిపోవునో, దాని యజమానుఁడు రెండవ వానికి తన వాహనపు ఆభరణము లీయవలెను" అని ఇరువురొడంబడిక చేసికొనిరి. పందెమున నలరాజు ఓటువడియెను.

అందుచే నాతఁడు తన ఘోటకమున కలంకరించిన యాభరణములన్నియు బాలున కొసంగెను. బాలుఁడు, పెద్దన్న కుమారుఁడు గట్టిన ప్రతిమ మాత్రము గైకొని మిగత యాభరణములన్నియు మరల నాతని కొసంగి గృహమున కేఁగెను.

అలరాజు గురజాలకుఁబోయి శ్వశురుని గృహమలంకరించెను. మామయు, అత్తయు, ఇతరబంధువు లెల్లరు మిగుల గౌరవించి, యందఱి క్షేమసమాచారము లడిగిరి. పిమ్మట రాచమల్లుఁడు తనమామ సింహాసనాసీనుఁడై, సామంత రాజులు, మంత్రిణియగు నాయకురాలు మున్నగువారలతోఁ గ్రిక్కిఱిసియున్న కొలువుకూటము ప్రవేశించి భూపాలునకు వందనము లాచరించి రాయబారము నివేదించెను. నలగామఁడును, నాయకురాలును తోఁకఁ ద్రొక్కిన పామువలె "గస్సని" లేచిరి. బ్రహ్మనాదులకు రాజ్యమీయమనిరి. వలయుచో రణమున గెలువుమనిరి. ఆ మాటలు అలరాజునకు మిగులఁ గోపముగలిగించెను. నిండుకొలువున నిలుపఁబడి, తొలుత నుండియు నాయకురా లొనర్చుచుండిన దుస్తంత్రములన్నిఁటిని పూసగ్రుచ్చినట్లు చెప్పెను. కాని యవియన్నియు నలగామునికి చెవిటికి సంకూదినట్లయ్యెను.

ఆ మాటలు నాయకురాలికి మిక్కిలి క్రోధము గలిగించెను. రాచమల్లుఁడు మేడపి చేరకమున్నె, త్రోవలోనే యాతని నంత ముందింపనెంచెను. నరసింగును ప్రోత్సాహపఱచెను. అలరాజు రాయబారమున నపజయము గాంచుటచే, మామయింట నారేయి భుజింపనొల్లక యపుడే బయలుదేరి 'చెర్లగుడిపాడు' సమీపించుచుండెను. అంతలో త్రోవలో నరసింగు తాఁకొని

మాంత్రోపాయములచే సతని కాహారమునందు విషమిప్పించి, అకాలమృత్యువు వాతఁబడజేసెను.

ఆఘోరవార్త రత్నాల పేరమ్మకుఁ దెలిసినది. వీర మేడపి యంమను దెలిసెను. పేరమ్మ ఆభరణములన్నియు ధరించినది. నొసట కుంకుమదిద్దినది. తెల్లనివలువ గట్టినది. శిరమున నీటిభాండ ముంచినది. తండ్రియగు నలగాముని కడ కరిగినది. అతఁడు తొలుతనుండియు నొనర్చిన క్రూరకార్యములను ఖండించినది. భళ్ళున నీటికుండ క్రిందబడవైచి పగులఁ గొట్టినది. చరచర భర్తశవముకడ కరిగినది. ఆ శవమునకు ముమ్మారు ప్రదక్షిణము చేసినది. ముందు జన్మమునఁ గూడ నాతనినే తనపతిగ నొనర్ప దేవతల నారాధించినది. జాజ్వల్యమానమైమండుచుండిన పెనుమంటలోఁబడి తనువుచాలించినది.

—0—

# 6. అనపోతు

శ్రీమాంచెర్ల చెన్నకేశవుని యనుగ్రహమున బ్రాహ్మణ దంపతుల కుదయించిన వీరుఁడు అనపోతు. బాలచంద్రుని మిత్రులారుగురిలో నితఁడొకఁడు. బ్రాహ్మణుఁడయ్యును మిగుల బలపరాక్రమశాలి, దేశాభిమాని, భ్రాతృప్రియుడు. బాల్యము నుండియు నితఁడు బాలచంద్రుఁడు మొదలగు వారలతో మిగుల నైకమత్యము గలిగియుండెను. ఇతఁ డందఱిచేతను మిగులఁ బ్రేమింపఁబడుచుండెడివాఁడు. బాలచంద్రున కితఁడనిన మిగులఁ బ్రీతి.

కార్యమపూడిలో జరిగిన యుద్ధమునఁ దొడ్లోల బాల చంద్రాదులను వీరమేడపియందే యుంచిరని మాపాఠకు లిది వఱకే యెఱుంగుదురు. ఆ బాలచంద్రాదులలో ననపోతొకఁడు. బాలచంద్రుఁడు బొంగరములాడుచుండినపు డకస్మాత్తుగ అతనిబొంగరము కోమటి అన్నమ కాలికిఁ దగిలి ఆమెను మూర్ఛాక్రాంతురాలిగ నొనర్చినపిదప, నాయువతి తెప్పఱిలి, బాలుని నిష్ఠుర వాక్యములచే నిందించి యుండెనుగదా! అనపోతు ఆమాటల నాలించి, యువతిని జంపుట కుఱికెను. బాలచంద్రాదులు మరల్చుటచే మరల నాతఁ డూరకుండెను. బాలుఁడు తల్లి యనుజ్ఞ గైకొని, కార్యమపూడికిఁ బోవుచుఁ ద్రోవనుగల తన భార్యయగు మాంచాలను జూచుటకుఁ దన మిత్రబృందముతో నరిగెను. బాలుని మామగారింటఁగల మహాలునందు లెక్కకు మిక్కిలియగు కుర్చీలు, బల్లలు, సోఫాలు, తివాచీలు మొదలగు పలురకములగు నాసనములమర్పఁబడి యుండెను. వానియందా వీరులందఱు నుపవిష్టులైరి. బాలుని పదప్రక్షాళనమునకు మాంచాల స్వర్ణ కలశముతో నిర్మలోదకము దెచ్చినది. మఱఁదులందఱు వదినగారి రాకకు సంతోషించి నిలువఁబడి గౌరవించిరి. అనపోతు బ్రాహ్మణుఁ డగుటచే కూర్చుండియే యుండెను. భర్తయగుటచే బాలుండును ఉపవిష్టుఁడయియే యుండెను. మాంచాల తన భర్తమొగ మంతటిదనుక నెఱుఁగకుండుటచే వారిరువురలోఁ బతి యెవరో నిర్ణయింపఁజాలక, అనపోతునే భర్తగ పొరబడి పాదములఁ గడుగ సమీపమున కేగెను. అప్పు డనపోతు "అమ్మా! నేను నీ నాథుని స్నేహితుఁడను. బ్రాహ్మణుఁడ నగుటచే గూర్చుండియే యుంటిని. అతఁడు

నీపతి. ముందాతనికిఁ బరిచర్య సేయుమా ! కులమునకుఁ గీర్తిదెమ్ము. నీపతిని రణమునకంపి వీరవనితవు కమ్ము" అని పలికెను. మాంచాల తన హృదయమున నించుక నొచ్చుకొని పిమ్మటఁ దన భర్తపాదములఁ గడిగి యంతఃపురమునకుఁ గొంపోయెను.

అనపోతు మొదలగు బాలుని యారుగురు స్నేహితులచటనే యుండిరి. బాలచంద్రుఁడు లోనికేగి భార్యతో సరస సల్లాపములచేఁ గాలము గడుపుచుండెను. బాలుఁడు మిత్రులు నియమించినవేళ నతిక్రమించెను. ఎంత తడవునకును బాలచంద్రుఁ డంతఃపురమునుండి రాడయ్యెను. ముందు జరుగనున్న కార్యక్రమమును మఱచి బాలుఁడు స్త్రీలోలుఁడై యుండెనేయని అనపోతుఁ డమితాగ్రహావేశుఁడై యుండి నిమీలితలోచనుఁడై బాలునిరాకకెదురుచూచుచుండెను. కాని ఎంత తడవునకును బాలుఁడు రాఁడయ్యె. "ఏదైన నౌఁగాక! పిమ్మట బాలుఁడు నన్నుదూలనాడిన నాడుఁగాక!" యని తలచి, అనపోతు ధైర్యంబు చిక్కఁబట్టి, మాంచాలా బాలచంద్రులున్న యంతఃపుర ద్వారముకడ కరిగి యిట్లనియె. "బాలచంద్రా! నీవుబొత్తిగ మూర్ఖునివలెనున్నావు. జరుగవలసిన యంశములనే మఱచి, భార్యాలోలుఁడవై నీవిచట సుఖముగఁ గాలముఁ గడుపుచుంటివా? ఇవియేనా పౌరుషవంతులగు పురుషుల కుండవలసిన లక్షణములు ? లెమ్ము. లెమ్ము. ఇప్పటికైన మేల్కొనుము. రణమున కేగుటకు మాకయిన ననుమతినిమ్ము". ఆమాటలు విని దంపతులిర్వురు నిర్విణ్ణులైరి. బాలచంద్రుఁడు తన తప్పిదము గ్రహించి మిగుల

నెచ్చుకొనియెను. భార్యనలనఁ బొందవలసిన దీవెనల నంది కొని, మిత్రులందఱును, సైన్యమును వెంటరా, కార్యమఫ్గాడి రంగమునకు బాలుఁడు పోవుచుండెను.

అట్లు వారందఱు గొంతదవ్వేగినపిదప బాలుఁడేదియో మఱచినట్లు నటించి "మిత్రులారా! నా ప్రియురాలియొద్ద నా పచ్చల పతకమును, రవల యుంగరమును తొందరలో మఱచి వచ్చితిని. అవియే ముఖ్యములగు నా బహిరాభరణ ములు. అయ్యవియే లేనిచో నాకు ధైర్యోత్సాహము లడు గంటును. అవి మరల నాకిపుడు వచ్చుటెట్లు?" అనెను. అనవు డనపోతు "సోదరా! నేనేగి తత్క్షణంబ వానిఁ గొనితెత్తు. మీరింతలో నేగుచుండుడు" అని పలికె. బాలుఁడేదియో యొక నిర్ణీతప్రదేశ మాతని కెఱుకపఱచి "యటనుందుము, వైళంబరమ్మని" పనిచె. అంత ననపోతు అశ్వారూఢుఁడై వాయువేగంబున మేడపికిం జని, "బాలుఁడు మఱచిన యాభర ణములి" మ్మని మాంచాలనడిగెను. ఆమె యావస్తువుల నెంత వెదకినను గానరాకుండుటచే, దావచ్చిన కార్యము నిష్ఫల మాయెగదాయని మిగులఁ జింతించి, మరలఁ గదనరంగ మార్గముననేగి కడకు నియమిత ప్రదేశమున నిలిచెను. కాని యచట నతఁడనుకొనినటుల నతనిమిత్రులు లేరైరి. అచటఁ గల వటవృక్షచ్ఛాయ-నించుక విశ్రమించె. ఆ వృక్షరాజము నకుఁగల శాఖాగ్రమున వ్రేలాడఁగట్టిన యొక యుత్తరము వైపు ఆతనిదృక్కులు హఠాత్తుగ మఱలినవి. ఆ కమ్మనుదీసి వైళంబ దానిని జదువఁ బ్రారంభించెను. అందిట్లున్నది:

"సోదరా ! నీవు బాల్యమునుండియు నా కొనర్చిన సేవ అపారము. నే వేయిజన్మములకైన, నీ మేలును మఱువఁ జాలను. ఇపుడు కార్యమపూడివద్ద యుద్ధము జరుగనున్నది కదా! అంతు జయాపజయంబులు దైవాధీనములు. ప్రాణము లన్ననో బుద్బుదప్రాయములు. ఎవ రమరలోకవాసు లగుదురో, ఎవ రిలాతలంబున జీవింతురో దెలుప నశక్యంబు. దైవ ప్రతికూలతచే నీకేదేని హాని వాటిల్లిన నీవు బ్రాహ్మణుఁడవుగదా ! నిన్నుఁదెచ్చిన నాకా బ్రహ్మహత్యాపాతకము తప్పక చుట్టుకొనును. పాతకము లన్నిఁట నియ్యది మిగుల ఘోరమయినది. నీ వెఱుంగని ధర్మము లెందేనిఁ గలవా ? అంతుచే భ్రాతృసముఁడనైన నామాట లాలించి మఱలి మేడపికిం జని యచట స్త్రీలఁ గాపాడుచుండుము.

ఇట్లు ప్రియమిత్రుఁడు,

బాలచంద్రుఁడు.

ఆ యుత్తరమును జదివినంతనే యనపోతు చిత్తము మిగులఁ దత్తరపడియెను. తన శిరమున నొక పిడుగు వడినట్లాతఁడు భావించి మూర్ఛిల్లెను. కొంతతడవునకా బాపనవీరుఁడు తెప్పిరిల్లి, "అయ్యో! నాకెట్టిదినములు సంప్రాప్తించినవి. బాలచంద్రుఁ డీవిధముగఁ జేయుట కతఁడేమైన నాయం దలుకబూనెనా? బాల్యమాదిగా నాకుఁగల కదనరంగ క్రీడాసక్తియు, శత్రుసేనలనుజెండాడువాంఛయు నేటితో భగ్నమాయెనుగదా? నే బాల్యమునుండియు నభ్యసించిన శరవిద్యాపాండిత్యపటిమ యంతయు బూడిదలోఁబోసిన నేయివిధమున నాయెనే ! నేనేమి సేయుదును? ఎందుఁ బోదును ?

ఇచటనే,ఇపుడే, ఈకరవాలంబుననే నా ప్రాణంబు లర్పింతు" నని పౌరుషావేశంబున నెక్కు ద్రేటునఁ దన నిశితఖడ్గంబునకు దనప్రాణము లర్పించె.

పాఠకులారా ! కాంచితిరా ! పలనాటివీరులు, అందు బాలచంద్రుని వీరుఁడగు అనపోతుఁ జూపిన దేశాభిమానము ! త్యాగము ! పౌరుషము ! వీరత్వము !

# 7. కన్నమదాసు

కన్నమదాసు తెప్పలినాయఁడు, పెమ్మసాని యను పంచమ దంపతుల కుదయించిన వీరుఁడు. బ్రహ్మనాయనికిఁ జాలకాలమువఱకు సంతానము కలుగక పోవుటచే, నీతనిఁ బెంచుకొనెను. నాయఁడు బోధించిన వైష్ణవ మతమునందు వర్ణభేదము లేకుండుటచేతను, పంచముల దుస్థితి నివారించు టయుఁగూడ నాతని యుద్దేశములలో నొకటి యగుటచేతను, మతంగబాలునే యాతఁడు పుత్రునిగస్వీకరించెను. కన్నమకు వయసు వచ్చినంతనే విద్యాభ్యాసము చేయించెను. కన్నమదాసు బాల్యమునుండియు మిక్కిలి చాకచక్యముతో విద్యల నభ్యసించుచుఁ దోడిబాలురలో విద్యాధికుఁడై యుండెను. కులవృత్తి విద్యలనేగాక క్షత్రియవీరుల కుండఁదగిన అస్త్ర, శస్త్ర విద్యలఁ గూడ నామూలాగ్రముగ నేర్చెను. శత్రువు లెంద ఱెదుర్కొనినను వెనుకంజవేయక బిరబిర నరిగి, గిర గిర కరవాలంబును ద్రిప్పుచు, వారిగొంతులు కసిదీఱఁ గర కరఁగోసి కదనరంగమునఁ బడనేసెడివాఁడు.

ఇట్లు కన్నమదాసు దినదిన ప్రవర్ధమానుఁడగుచుండ, బ్రహ్మనాయునికి బాలచంద్రుఁ డుద్భవించి పెరిగి పెద్దవాఁడగుచుండెను. వారిరువు రొండొరుల నెడఁబాయక, ఒక తల్లి బిడ్డలవలె, నన్యోన్యమైత్రితో మెలంగుచుండిరి. అంతలో నొకానొక కారణంబున "బాలచంద్రుని వధియించి రమ్మ"ని బ్రహ్మనాయఁడు కన్నమదాసును బంపె. తండ్రి మాటల వినినంతనే కన్నమదాసు ప్రాణము లెగిరి పోయినవి. సోదరునిఁ గాపాడుమని తండ్రినెంతయో ప్రార్థించెను. కాని నిష్ఫలమనోరథుఁడయ్యెను. అందుచేఁ గన్నమదాసు, బాలచంద్రు నెట్టులయిన సంరక్షింప సమకట్టి, బ్రహ్మనాయని సోదరుఁడగు పేరినాయని యింటనుంచి రహస్యముగఁ గాపాడుచుండెను. చూచితిరా! దాసు నీచకులమునం దుద్భవించినను, నాతనికిఁ గలిగిన వాత్సల్యము! కులమునకు, గుణమునకు ణుమాత్రమైన సంబంధము లేదుగదా!

కన్నమదాసు బాలుని సంరక్షించుచు కాలముగడుపుచుండునంతలో మాచర్ల పురవాసియు, లక్ష్మపుత్రుఁడునగు గండు కన్నమనాయఁ డొకానొక దినంబున నిండుకొలువున బ్రహ్మనాదులుండఁదన కుమారిక మాంచాలకు వివాహము జేయవలయుననియుఁ దగిన వీరవరుఁడెచటఁ బొడగాంచ లేదనియుఁ బలికెను. అప్పుడు కన్నమ బాలచంద్రుని వృత్తాంతము దెలిసినవాఁడగుటచేతను, బాలుఁడు మాంచాలాంబకుఁ దగిన వరుఁడగుననుటకు సందియ ముండకపోవుట చేతను, "అచిరకాలములోనే నీ కుమారితకుఁ దగిన వరుఁడు లభింపగలఁడు" అని గండుకన్నమనాయనితోఁ బలికె.

ఒకానొక దినంబున వందలు కొలువున నుండఁగా పదునాలువత్సరములు గలిగి నిమ్మపండునుబోలు శరీర చ్ఛాయ గలిగి గంభీరవిగ్రహముతో విశాలవక్షమమర, నూనూఁగు మీసములతో, కాకపక్షములతో సదస్యుల కచ్చెరువుగొలుపు నొక వీరశిఖామణి వచ్చి అందఱిముందర నిలిచెను. అతఁడెవరోయని ప్రేక్షకులెల్లరు విస్మితచిత్తులయి చూచుచుండిరి. పిమ్మటఁ గన్నమదాసు ఆ బాలుని వృత్తాంతము దెలిపి యతఁడే బాలచంద్రుఁడనియు, మాంచాలకీడగు వరుఁడనియు నెఱింగించె. బాలునిఁ గాంచినంతనే బ్రహ్మన విముఖుఁడై వధించిరమ్మని భటుల ననుజ్ఞనొసంగె. కాని కొలువు నలంకరించిన పెద్దలంద ఱొక్కపెట్టున 'బాలుని స్వీకరింపుఁ'డని బ్రతిమాల, వల్లెయని యాతఁడంగీకరించి, పిమ్మట నొక సుముహూర్తమున మాంచాలాంబ నిచ్చి పాణిగ్రహణమహోత్సవ మొనరించె.

కన్నమదాసు మిగులఁ బౌరుషశాలి. నాయకురాలు తనకు బ్రహ్మనాదులయందుఁ గల యసూయచే, గురిజాల నుండిఁ గొందఱుచోరుల వర్తకుల వేషంబులఁ బంపి, మాచెర్ల దోపిడిచేయ నియమించె. వారు ఒకనాఁటి యర్ధ రాత్రంబున మలిదేవుని ధనాగారంబుఁ జొచ్చి మెల్లనఁ గార్యాసక్తులై దోచుచుండిరి. అంతలోఁ గావలియుండిన భటుఁడొకండు మేల్కాంచి, సంగతినారసి, మెల్లనఁ గన్నమ దాసున కెఱింగించె. కన్నమ ఇతరులను మేల్కొలిపిన నిద్రా భంగముగలుగునని తలఁచి, ఒక్కరుఁడే తనఖడ్గంబును దక్షిణ కరంబున బట్టి, హుంకరించుచు,సింహగర్జనము జేయుచు, రిపు

సమూహము నెదుర్కొనియె. దాసును గాంచినంతనే కొందఱు చోరులు కాలికి బుద్ధిచెప్పిరి. మఱికొంద ఱెదురుపడి తునాతునకలు గావింపఁబడిరి. మిగిలిన చోరులు బంధింపఁబడిరి. మఱునాఁటి యుదయమున, నెల్లరు కన్నమ శౌర్యమును మిగులఁ బొగడిరి. బ్రహ్మనాదులతని మిగులఁ గొనియాడి గౌరవించిరి. పిమ్మట బ్రహ్మనపంపున బంధితులైన దొంగల వీపులపై నిసుకగోనెల నెత్తించి, నయ్యావి వారలచే మోయించుచు మాచెర్లనుండి గురిజాలవఱకు గొఱ్ఱల మందలవలెఁ దోలుకొనివచ్చెను.

నలగామరాజునకు యథార్థపు సంగతి దాసు విన్నవించెను. కాని నాయకురాలు ఆ మాటలు నమ్మఁదగినవి కావనియు, అంతయు బ్రహ్మనాయని కల్పితములనియు నలగామునకు నచ్చఁజెప్పెను. నాయకురాలు తన కోరిక నెఱవేఱుటకు మారుగఁ జోరులు చంపబడిరనియు, అవమానింపఁబడిరనియు దెలిసికొని, వారి దుస్థితికి కన్నమయే కారణమని గ్రహించి యాతనిని గురిజాల దాటకమున్నె మడియింప ననేక కపటోపాయంబులఁ బన్నెను. కాని కన్నమ యెదుట నవన్నియు నిష్ఫలములాయెను. పిమ్మటఁ గన్నమదాసు కార్యమపూడిలో జరిగిన పల్నాటియుద్ధమున పెక్కువీరుల నుక్కడించి, తక్కిన శూరులకంటె మిక్కిలి పౌరుషముఁజూపి కదనరంగమున నసువులు వీడెను.

—0—

# 8. లంకన్న

బ్రహ్మనాయని కుమారుఁడగు బాలచంద్రుని స్నేహితులలో లంకన్న యొకఁడు. అతఁడు "వెంకజోదు" అను మఱొక పేరున గూడఁ బిలువఁబడుచుండెడివాఁడు. అతడు బ్రహ్మనాదుల గోవులను రక్షించు గోపాలుఁడు. మాంచాల చెలికత్తెయగు "మాడచి" యనునామె సోదరుడు; బాహుబలపరాక్రమ సంపన్నుఁడు.

బ్రహ్మనాదులు మాచెర్లవీడి మండాదికిఁ బోయినను వారు ధన, ధాన్య, గోబృందములతో సుఖముగఁ కాలము గడుపుచుండిరనుసంగతి నాయకురాలు విని కన్నుగుట్టి ఒకనాడు నిండుకొలువున నున్న నలగామరాజుతో "ప్రభూత్తమా! నామనవి నించుక నాలింపుఁడు. బ్రహ్మనాయని దుర్నీతులు బాల్యమునుండియు నెఱిఁగియే యుందురు. ఐనను, నేనొక విషయమెఱిఁగించెద. చిత్తగింపుఁడు. అతడు మాచెర్లయందుఁగల సమస్తనిక్షేపముల నొడంబడిక ననుసరించి మనకొసంగ వలయునుగదా ! అట్టిఁడు ధన, ధాన్యములను, ప్రజలనేగాక గోసమూహంబుల గూడ మండాదికిఁ గొంపోయి కడువైభవముతోఁ దులఁదూగుచున్నాడఁట. "ఎట్టులైన వానిన్నిఁటిని మనము కొల్లఁగొట్టవలయు" నని సవినయంబుగఁ బలికె. నలగాముఁడా టక్కులమారి మాటలు నిక్కువములనియే నమ్మి, వానినిఁ దోచుకొని వచ్చుట కామె కనుమతి నొసంగెను.

వెంటనే మాయలమారి యగు నాయకురాలు వీధుల పక్షిఁడను చెంచునాయకుని రావింపఁ దలఁచి వాని కడకొక

వార్తావహులనిచెరు. చెంచునాయకుండు నవ్వార్త నాలించిన తోడనే ససైన్యుండై గురిజాల కేతెంచెను. పోతిసేడు, చెంచుల మల్లన్న యనువారలుగూడ చెంచులలో మిగుల శూరులు. నాయకురాలు వారికందఱికి నుచితాసనము లొసంగి, గౌర వించి, "మందాడి కేగి యచటంగల ధన, ధాన్యరాసులను, గోవుల నపహరించి తెచ్చిన నీకు మా చెల్లభాగ మేలుకొనుట కధికార మొసంగెదము" అని నాయకురాలు, పల్నినితోం బలికినది. చెంచులందుల కంగీకరించిరి. నలగాముని సైన్యమును గూడం గొంత నిచ్చెదమని నాయకురాలు చెప్పినది.

మఱునాండే పల్నిండు బయలుదేఱి మందాడి త్రోవం బట్టి గుండాలబాటకుం జేరెను. వెంట ననేక సైనికులు బూరలు మ్రోగించుచు, పాటలంబాడుచు, నాటలనాడుచు, సంతోష ముప్పతిల్ల గంతులిడుచుం దమతమ యాయుధములతో నరు దెంచుచుండిరి. వారి కోలాహలము మిన్నుముట్టుచుండెను. పల్నిండుసైన్యముతోంగూడ గుండాలబాటం జేరెను. అటనుండి ఆతడిద్దఱు సైనికుల 'మందాడికి' బంపి, యచటివృత్తాంతము నరయుమని యాజ్ఞాపించెను. వార లరిగివచ్చి "గోవులమందకు నొకవైపున గుడ్లేరుకలదు. కడమపార్శ్వములందు వెదుళ్లు క్రిక్కి రిసి యున్నవి. ఆవరణలో దుంధుభులు, బోయలు, వారి నాయ కుండు లంకన్నకలడు. ఆమందలో చిగురువన్నెవి, చింతపువ్వు వన్నెవి, చెంగల్వ మచ్చలవి పలురకములగు గోవులున్నవి. ఆవులు బలిసి పోతరించియున్నవి. వానిని మనము తెచ్చుట బహుదుర్లభము" అని పల్నినునకు విన్నవించిరి. ఐనను పల్నిడు వెనుకంజవేయక సైన్యమున కుత్సాహము, పౌరుషము

గలుగు పలుకులఁబలికి, వారిని వెంటనిడుకొని, ఆలమందకు బయలుదేఱెను.

ఆవార్త క్రమక్రమముగ లంకన్న మొదలగు వీరవరులకుఁదెలిసెను. లంకన్న బ్రహ్మన్నకడకేగి, పల్నాను నెదుర్కొని యుద్ధముచేయుట కనుమతిఁబడసెను. పిమ్మట లంకన్నకొలువు తీర్చెను. బోయలనేకులుకలరు. పుల్లావుల పోతన్న, బూరుగ చెంచన్న, నత్తావుల ప్రోలు నాగన్న, కొరవి రామన్న, కొండ బోయఁడు, పరిగం మాలెబోయఁడు, బాలెబోయఁడు, కన్న మేకల చెన్నబోయఁడు, కాటిబోయఁడు, పింఛము సింగన్న, పిన్నబోయఁడు, గుండెబోయఁడు, గూబ రామనబోయఁడు, తోడేటి దామనబోయఁడు, దోరబోయఁడు, నిలువుగాళ్ళ నిమ్మన్న, నిడదబోయఁడు, తిక్కమేకల తిప్పబోయఁడు, తిరువీధి సంగన్న, దిండెబోయఁడు, మటగాళ్ళ మాచన్న, మల్లెబోయఁడు, ఎడమగాళ్ళ యెఱ్ఱన్న - వీరు వారలలో శూరులు. వీరందఱు లంకన్న పాదములకు మ్రొక్కి కూర్చుండిరి. తంభీముఁడు, వీరగాముఁడు, బ్రహ్మనాయని సోదరులు. వీరుగూడ కదనమునకుఁ బయనమైరి. లంకన్న వలదనినను వారును యుద్ధసన్నద్ధులైరి.

చెంచులనాయకుఁడు సమీపమునకు వచ్చుచుండెనని లంకన్నకుఁ దెలిసి గోవులకడ కరిగి "ఆణిముత్యము రావె- అలివేణి రావె; లేతమామిడి రావె-లేదోటరావె," అని పేరుఁ బేరులతో నాధేనువుల బిలచి, మేనులఁదట్టి శరీరముల మూర్కొనెను. ఆవులన్నియు తోఁకలాడించుచు లంకన్నకు స్వాగతమిచ్చినవి. అన్ని ఆవులపాలను లంకన్న పితికించెను.

క్షీరము నురుగులగ్రక్కి సముద్రతరంగములవలెఁ బ్రవహించు చుండెను. పల్నాఁడు యుద్ధమునకువచ్చెను. తంభీముఁడు, వీర గాముఁడు, ముత్యాలమల్లు చెంచుల నెదుర్కొనిరి. ముత్యాల మల్లు యుద్ధములోఁ జచ్చెను. ఆతనిభార్య పాపమ్మ భర్తకు మాఱు ఆమె చెంచులతో యుద్ధముచేసి వారల ననేకులఁ జంపి పతిప్రక్కనే ఒరిగినది.

పిమ్మట తుల్లావుల పోతన్న, పింఛము సింగన్న కూడ యుద్ధములో మడిసిరి. ఈసంగతి లంకన్నకుఁ దెలిసినది. యుద్ధ మున కాతఁడు సిద్ధమాయెను. లంకన్న శరీరమందంతటను గంధముఁబూసికొనెను. నొసటఁ దిరుమణి దిద్దెను. మెడలోఁ జెంగల్వదండ, మొలను పట్టుధోవతి కట్టెను. డాకాల అందె, ప్రక్కనకత్తి, పీపునఅమ్ములపొది, చేతవిల్లును ధరియించెను. లంకన్న చెంచుల నెదుర్కొనెను. అతఁడు చెంచుల సోమినీని జెండాడెను. వీధుల పల్నినుని వెనుకకుఁ బడనేసెను. తాటి పోతినీని తల తెగనఱికెను. ఇంక ననేకులను యుద్ధములోఁ చెల్లాచెదరు గావించి కాలునిపురమున కనిపెను. చెంచు లందఱు లంకన్నను నలువైపులఁ జుట్టుకొనిరి. బాణవర్షము గురియించిరి. లంకన్న పౌరుషముతోఁబోరాడెను. హఠాత్తుగ నొక బాణ మాతని గుండెలో గ్రుచ్చుకొనెను. వెంటనే యాతఁడు నేలకొరిగెను.

—0—

# 9. నాయకురాలు

పల్నాటిసీమయందు "జిట్టగామాలపాడు" అను నొక గ్రామముగలదు. ఆగ్రామములో చాదరి రామిరెడ్డియను నొక రైతుగలఁడు. అతఁడు మిగుల బీదవాఁడగుటచే సేద్యముచేసి కొనియే భుక్తి గడుపుకొనవలసి యుండెను. సంతానమాతనికి లేదు. ఒకనాఁడాతఁడు తనపొలమును దున్నుచుండఁగాసమీపమున శిశురోదన మాతని కర్ణములకు సోఁకెను. వెంటనే యాతఁడా ప్రదేశమునకుఁ బోయి దిక్కులేక యేడ్చుచుండిన ఆడుబిడ్డ నొకదానిని గాంచెను. సంతానము లేకుండుటచే, ఆబాలికను గాంచినంతనే మిగుల సంతసించి యామెను తన గృహమునకుఁ గొనిపోయెను. ఆబాలికకు 'నాగాంబ' యని పేరిడి తాఁ గన్నకూతురు చందంబున మిగుల గారాబముగఁ బెంచుచుండెను. కొంతకాలమున కామెకు నాయకురాలను నామము సయితము గలిగెను.

నాగాంబ నానాటికి శుక్ల పక్ష శశాంక రేఖ వలె దినదినాభివృద్ధిని గాంచుచుండెను. ఆ బాలిక రామిరెడ్డి యింటఁ బెరుగుచున్నపుఁ డతని గృహము బాలచంద్రుఁ డుదయించిన పశ్చిమదిక్కు వలె, కళకళ లాడుచుండెను. ఆమె రెడ్డియింటఁ గాలుపెట్టినది మొదలు, అతనియింట ధనధాన్యములు కుప్పలు కుప్పలుగా నుప్పతిలుచుండెను. పంచవర్ష ప్రాయము వచ్చినంతనే రామిరెడ్డి, నాగాంబకు విద్యాభ్యాసమును జేయించెను. ఆమె మిక్కిలి తెలివితేటలతో విద్య నభ్యసించుటయేగాక, క్రమక్రమముగా దేశపరిపాలనా విధా

నము, యుద్ధమునందలినేర్పు మొదలగు విషయములనుగూడ నాయనలాగ్రముగ నభ్యసించుచుండెను. ఆమెచాకచక్యము, పట్టుదల, ఆలోచనానైపుణ్యము, విద్యాకౌశల్యము గాంచిన వారందఱు నాగాంబ సామాన్యురాలు గాదనియు, వీరవనిత యగుననియుఁ దలంచుచుండిరి.

ఇంతలో నాయకురాలికి వివాహకాల మాసన్నమగుటచేఁదండ్రి, రామిరెడ్డి యామె నొక ధనికుని కొసంగి, పాణిగ్రహణమహోత్సవముఁ జేసి స్వర్గలోక మలంకరించెను. కాని వివాహమైన స్వల్పకాలముననే నాగాంబ వితంతువయ్యెను. ఆమె తనకుఁగలిగిన కష్టపరంపరల నిసుమంతయు లెక్కసేయక, రాజకీయవ్యవహారములందుఁ బ్రవేశించి, పలనాఁటి సీమయందొక యగ్రస్థాన మలంకరింపనలెనని ప్రతినఁబట్టెను. అప్పుడు పల్నాటిసీమను అలుగురాజుయేలుచుండెను. నాయకురా లప్పుడప్పుడు గురిజాలకు వచ్చి, రాజుతోఁ బరిచయము కలిగించుకొని క్రమక్రమముగా నాతనికి హితురాలయ్యెను.

అంతలో అలుగురాజు కాలధర్మము నొందుటచే నలగామరాజు ప్రభుఁడయ్యెను. నాయకురాలు నలగామునితోఁ గూడఁ బరిచయము జేసికొని క్రమక్రమముగా రాజకీయ విషయములందు జోక్యము కలిగించుకొనుచుండెను. రాను రాను నలగాముఁడు నాయకురాలిచేతిలోని కీలుబొమ్మవలె నుండెను. నాగాంబ ఆమెకుఁగల మాయోపాయ చతురత వలన 'క్షణకాలము పలనాఁటిసీమ దానేలునట్లు' నలగాముని వలన వరము వడసెను. మంత్రియగు బ్రహ్మనాయని

యందును సవతిసోదరులగు మలిదేవాదులయందును లేనిపోని కొండెములను జెప్పి, వారి నెట్టులైనను రాజ్యమునుండి వెడలఁ గొట్టవలయునని పట్టుపట్టెను. మలిదేవాదులకు ఆహారములో విషమును బెట్టించెను. వారిని మడియింప ననేక కపటోపాయములఁ బన్నెను. బ్రహ్మనాయనికి గురిజాల పౌరులు చూపు చుండిన సానుభూతిని, గౌరవమును నాయకురాలు సహింప కుండెను. అతనికిమాఱు ఆ మాయోపాయ ధురీణయే మంత్రి పదముననుండఁ దలఁచెను. క్షణ క్షణమునకు బ్రహ్మనాదుల యందేవో యున్నవియు, లేనివియుఁ గొండెములు చెప్పుచునే యుండెను. నలగామరాజు ఆ లేమమాటలే నిక్కువములని నమ్మి బ్రహ్మనాయని, మలిదేవులను గురిజాలనుండి మాచెర్లకు వెడలఁగొట్టెను.

బ్రహ్మనాయఁడు,మలిదేవులు మాచెర్లకుఁ బోయినను వారిని నాయకురాలు వీడలేదు. చోరులను గొందఱ మాచెర్లకుఁ బంపి యచటఁగల ధనధాన్యరాసులను దోచుకొని రమ్మని పంపెను. దోచుకొని వచ్చుటకు మాఱు ఆ దొంగలు బ్రహ్మనాయని కుమారుఁడగు కన్నమదాసుచేఁ బట్టువడి యవమానింపఁబడిరి. అందుచే నాయకురాలికిఁ గ్రౌర్యమత్యధికమయ్యెను. మరల వారి నాశనముకొఱ కనేకములైన యుపాయముల బన్నుచుండెను. కడకొకదివసంబున నాగాంబ నలగామునికడ కేగి "రాజా! మాచెర్ల కడువైభవముగ నున్న దఁట. ఎట్టులైన మనము శత్రుశేష ముంచరాదు. ఏదియేని యుపాయంబున వారినటనుండిగూడ వెడలగొట్టవలయు"నని పచ్చఁబలికె. నలగాముండును అందుల కంగీకరించెను.

నాయకురాలు తత్క్షణంబ "కుక్కుట సమరము గురిజాల యందు జరుగును. దానిని జూచుటకురండు" అని ఉత్తరము వ్రాయించి మాచెర్లకు బంపెను. బ్రహ్మనాదులు నిర్ణీత దినమునకుఁ గోడిపందెములను వీక్షించుటకేగిరి. నాయకురాలు ఆమెకుఁ గలిగిన తెలివితేటలవలన, నాయఁడు కోడి పందెములలో జోక్యముఁ గలిగించుకొనునట్లును, అందతఁడపజయము పొందునట్లును నొనర్చెను. ఇదివరకే నాయకురాలు ఒడంబడికను జేసికొనుటచే బ్రహ్మన మొదలగు వారందఱు మాచెర్ల నలగామునికి వశముగావించి యేడేండ్లు వలసపోయిరి. ఇప్పటికి నాయకురాలికిఁ గొంచెము మనసు స్థిమితమయినది.

మండాదియందుఁ గూడ బ్రహ్మనాదులు మిగుల భాగ్యవంతులై సుఖముగాఁ గాలము గడుపుచుండిరని నాయకురాలికిఁ దెలియవచ్చెను. నలగామరాజుతో ఆ విషయము చెప్పినది. భిల్లులను గొందఱ రప్పించి వారికి మాచెర్ల భాగమిత్తునని ఆశపెట్టి, మండాదికిఁ బోయి గోవుల మందలను దోలుకొనిరమ్మని పంపినది. వారుపోయి మండాది ప్రవేశించిరి. అచట లంకన్న మొదలగు వీరులను, గోవులను జంపిరి. కాని గోవులను దోడ్కొని రాజాలరైరి. అంతలో బ్రహ్మనాదులు గడుపవలసిన యేడు సంవత్సరముల కాలము ముగిసినది. అందుచే అలరాజును నలగామునివద్దకు రాయబారిగఁ బంపిరి. నాయకురాలు అలరాజును విషమిచ్చి చంపించెను. చూచితిరా! నాయకురాలి దుండగము లెంత తీవ్రముగ నుండెనో! సంధి కుదురకుండఁ జేసినది.

అందుచేఁ గార్యమపూడివద్ద నలగామరాజునకును, బ్రహ్మనాయఁడు మొదలగు వారలకును ఘోరయుద్ధము జరిగెను. ఆ యుద్ధములో నాయకురాలు పురుషవేష ధారిణియై ఖడ్గము, కవచము, బాకు, విల్లు మొదలగు నాయుధములు ధరించి, శత్రువులతో ఘోరముగఁ బోరాడెను. అనేకులామె ధాటికి కోరువఁజాలక పర్విడిరి. పరుగెత్తిన కొలఁది ఆ వీరవనిత శత్రువులను దరిమికొట్టినది. ఆమె అప్పుడు పోరాడిన కొండప్రదేశము కార్యమపూడివద్ద నేఁటికిని గాన వచ్చుచున్నది. దానినే "నాయకురాలికనుమ" అందురు. ఆవిధమున నాగాంబ తన బాహుబలపరాక్రమ మెంతచూపినను అది అంతయు "బూడిదలోఁ బోసిన నేయి విధమున" వ్యర్థ మాయెను. ఆమె పక్షమందుఁగల సైనికులసంఖ్య తగ్గఁ జొచ్చెను. ఆమె ధైర్యమును క్రమక్రమముగా క్షీణించెను. అందుచే నామె చేయునదిలేక బ్రహ్మనాయని శరణు జొచ్చెను. నాయఁడా వీరవనిత పౌరుషమును మిగుల గొనియాడి ఆమెను రక్షించి ఆమె జీవించినంతవఱకు అనుభవించుటకుఁ గొన్ని గ్రామములయం దధికారిణిగ నియమించెను. చూచితిరా! పలనాడులో పూర్వము స్త్రీలు సైతము ధైర్యసాహసములు గలిగి పురుషులకన్న నెంత నెక్కుడుగ విఖ్యాతి నందిరో!

—o—

# 10. వీరలక్ష్మి

## పెమ్మరాజు

ఇప్పటికి సుమారు రెండు, మూడువందల సంవత్సరముల క్రిందట మాచెర్ల గ్రామమున 'పెమ్మరాజు' అను నొక బ్రాహ్మణుఁడు నివసించుచుండెను. అతఁడే యా గ్రామమున కధికారి. పెమ్మరాజు ఆజానుబాహుఁడు. సుందరవిగ్రహుఁడు. దూరాలోచన గలవాఁడు. పట్టుదలగలవాఁడు. మిగుల సమర్థుఁడు. ఆతని మాటయనిన మాచెర్లయందేగాక పరిసర గ్రామములందుగూడఁ దలదాల్పఁబడుచుండెను. ఎల్లరాతనిని జూచిన 'మృగరాజునుగన్న హరిణంబులమాడ్కి' భీతిల్లుచుండిరి. పెమ్మరాజు సరసత్వమునకు గూడ తీసిపోవువాఁడు కాఁడు. సమయమఱుదెంచిన, విశాలహృదయముతో నెల్లరకుఁ దనకుఁ జేనగు సాయముజేసి ప్రజల మన్ననల కెంతయు బాత్రుఁడగుచుండెను. అధికార గర్వమనునది అణుమాత్రమైన పెమ్మరాజునకు లేదనిన నతిశయోక్తిగాదు. ఒకవంక నాతఁడు తన ప్రజల నేలోపము లేక మిగుల ప్రేమతో బాలించుచుండెను. మఱియొకప్రక్క నాతఁడు సమయమరుదెంచిన న్యాయమును విచారించి నిష్పక్షపాత బుద్ధితో నేరస్థులను కఠినముగ దండించుచుండెడివాడు. అందువలననే ప్రజలకొకవంక నాతనిజూచిన భయమును మఱియొకప్రక్క గౌరవమును, ప్రేమ గలిగియుండెను.

## స్వప్న సాక్షాత్కారము

పెమ్మరాజు మిగుల భాగ్యవంతుఁడు. సర్వలక్షణ లక్షితుఁడు. అతఁడెట్టి లోపమును లేక తన జీవితమును సుఖముగనే గడపుచుండెను. గాని సంతానము లేని కొఱఁత మాత్రమాతని హృదయమున నప్పుడప్పుడు వేధించుచుండెను. పెమ్మరాజు భార్య నరసాంబ సంతానముకొఱ కెన్నియో వ్రతము లాచరించినది. భూదేవుల కనేక దానములు చేసినది. వికలాంగుల కెంతయు ధనసహాయ మొనర్చినది. ఇంకెన్నియో సత్కృత్యము లొనరించినది. కాని ఎంతకాలమునకును నరసాంబకు సంతానప్రాప్తి కలుగదయ్యె. కడకొకనాటి యర్ధరాత్రమున 'లక్ష్మీదేవి' నరసాంబ స్వప్నమున సాక్షాత్కరించి "బిడ్డా! నీ నోములు ఫలించినవి. నీ సేవల కత్యంతానందము జెందితిని. అచిరకాలములో నీకు నన్ను బోలిన బాలిక గలుగును. ఆ బిడ్డకు నా పేరు పెట్టుకొనుము. శుభమగుగాక" యని పలికి అంతర్ధాన మొందెను.

## లక్ష్మీజననము - బాల్యము

శ్రీదేవి పలికిన విధంబున నరసాంబ గర్భవతియై, ఒకనాటి సుముహూర్తమున నాయమ ముద్దుల మూటఁగట్టు సుపుత్రికను గాంచెను. పెమ్మరాజునకపు డమితానందము గలిగెను. లక్ష్మీదేవి యానతిచ్చిన తెఱఁగున ఆ బాలికకు 'లక్ష్మి' యనియే నామకరణ మొనర్చిరి. పిమ్మట లక్ష్మి శుక్లపక్షమునాఁటి శశాంకునిపగిది పెమ్మరాజు గేహంబున దిన దినాభివృద్ధి నొందుచు, బిడ్డలు లేని యా పావనదంపతుల

కెంతయు ముద్దు ముచ్చటలందు కొఱఁత దీర్చుచుండెను. లేక లేక గలిగిన సంతానమగుటచే పెమ్మరాజును, యాతని గృహిణియు లక్ష్మిని పూవులలోఁబెట్టి పూజించుచుండిరి. రాత్రింబవళ్ళుసైతము ఆ దంపతులు తమబిడ్డ కెప్పుడేమి యుపద్రవము సంభవించునోయని, కంటికి గన్నాకు రెఱుంగున నా బాలికామణిని గాపాడుచుండిరి. ఇరుగుపొరుగు అమ్మలక్కలందఱు లక్ష్మియనిన నెంతయో గారాబమున బెంచుచుండిరి. ఇట్లు లక్ష్మి జనుల ముద్దులబిడ్డయై అలరారుచు పంచ వర్షప్రాయయయ్యెను.

## విద్యాభ్యాసము

ఆకాలమున పల్నాటిజనులకు విద్యాభ్యాసము మిగుల తక్కువ. అందు స్త్రీవిద్య బొత్తుగ శూన్యమనియే యనఁజెల్లును. అటులైనను పెమ్మరాజునకు మాత్రము తొలుత నుండియుఁ దన కుమారితను విద్యాంసురాలుగ నొనర్పవలయు నను ఆశయము మెండు. అందుచే లక్ష్మికి ఐదవ యేటనే విద్యాభ్యాసాది మంగళ కార్యము లొనర్చిరి. లక్ష్మియు తలిదండ్రుల యాజ్ఞల శిరసావహించి సక్రమముగ పాఠశాల కేగుచు నొజ్జలపట్ల కడుంగడు భక్తియుక్తులతోఁ బ్రవర్తించుచు విద్యాభ్యాస మొనర్చుచుండెను. ఇట్లు కొంత కాలముగడుప లక్ష్మి భాగవతము, భారతము మున్నగు గ్రంథముల నవలీలగ బఠించుటకును, అధ్యాత్మ రామాయణ కీర్తనలు మున్నగునవి శ్రవణానందకరముగ బాడుటకును నెంతయు నొప్పియుండెను.

## వేంకటరాజు

వేంకటరాజు పెమ్మరాజునకు బావమఱఁది. పిన్న వయసుననే తలిదండ్రులు దివంగతులగుటచే, వేంకటరాజు చిన్నతనము నుండియు బావగారింటనే కాలము గడుపు చుండెను. నరసాంబకు తొలుత నుండియు సంతానము లేకుండుటచే తమ్ముఁడగు వేంకటరాజును తన యింటనే యుంచుకొని మిగుల గారాబమున బెంచు చుండెను. వేంకటరాజు గూడ పెమ్మరాజునకు స్థితిగతులయందు దీసిపోవు వాఁడుకాడు. లక్ష్మిజనన మొంది నప్పటినుండియు "లక్ష్మి వేంకటరాజునకు దగినకన్య. ఇరువురు సమాన రూపురేఖా విలాస భాసురాంగులు" అని జనులనేక విధముల ననుకొనఁ జొచ్చిరి. నరసాంబకును, పెమ్మరాజునకును ప్రజలనుకొను చుండిన పలుకులెంతయు సంతసము గూర్చుచుండెను.

### వేంకటరాజు దుండగములు

వేంకటరాజు సుందరుఁడే! లక్ష్మికిఁ దగిన వరుఁడనియే యవఁజెల్లును. కాని ఆతఁడు బాల్యము నుండియు తుంటరులతో స్నేహముచేయ మొదలిడెను. ఎట్టి సద్గుణవంతునైనను దుస్సహవాసమేగదా దుర్మార్గునిగ నొనర్చునది. కల్లలాడుట, చీట్లాడుట, జూదమాడుట మున్నగు దురభ్యాసము లాయువకునికి ప్రబలముగాజొచ్చెను. ఒక్కక్షణమైన నింట నిలువక దివారాత్రంబులు తన దుష్టమైత్రి సమితితో గాలముగడుపు చుండెను. ఆతఁడు పోట్లాటలందు, కొట్లాటలందు, మిగులఁ బ్రసిద్ధి వహించెను. వయసు వచ్చిన కొలఁది జారత్వము నకును, తన్మూలమున చోరత్వమునకును నాతని హృదయము

తాపోసంగఁ జొచ్చెను. గ్రామము లెల్లరు వేంకటరాజు దుండగములు గాంచుచుండియు, పెమ్మరాజు మొగముగాంచి ఏమియు ననలేక యూరకుండవలసి వచ్చెను. అయినను ఎట్టిటో వేంకటరాజు దుండగములు పెమ్మరాజునకుఁ దెలియ వచ్చుచునేయుండెను. అప్పుడప్పుడు బావమఱఁదిని పెమ్మరాజు చీవాట్లు పెట్టుచునే యుండెను. అనేకవిధముల నాతని బుద్ధి మఱల్ప నరసాంబయు ప్రయత్నములు చేయుచుండెను గాని విఫలములుఁగా జొచ్చెను. పెమ్మరాజునకు బావమఱఁదియందు క్రమక్రమముగా ననురాగమునకు మాఱు, ద్వేషము ప్రబలఁ జొచ్చెను.

## నరసరాజు

నరసరాజు కడు పేదదంపతుల కుద్భవించిన బ్రాహ్మణ బాలుడు. తొలుతనుండియు నాతనికి దిక్కు లేకపోవుటచే నెట్టెటులో పెమ్మరాజు గృహముఁ జేరి, యాతనికిఁ జేదోడు వాదోడుగనుండి వారింటపనులన్నిఁటిని జక్కపఱచుచు తలలో నాల్కవలె మిగుల భక్తియుక్తులతోఁ బ్రవర్తించుచుండెను. నరసరాజు మిగులసద్గుణవంతుఁడు. ఎల్లప్పుడు ఆతఁడింటిపనుల యందే మిక్కిలి శ్రద్ధవహించి, దుస్సాంగత్యము చేయక సుగుణఖనియై అలరారుచుండెను. పెమ్మరాజునకు దొలుత నుండియు నరసరాజునందుగల వాత్సల్యము క్రమక్రమముగా దినదినాభివృద్ధి నొందుచుండెను. పెమ్మరాజు నరసరాజును తన స్వంతపనుల యందేగాక, సర్కారు పనులయందు గూడ తర్ఫీదొనర్చుచు క్రమముగా రెండుమూడు వత్సరములలో మునసబు పరీక్షయందు త్తీర్ణుఁడగునట్లుగ దయారుచేసెను.

## వివాహాలోచనలు

ఆ కాలమునం దిప్పటివలె అతిబాల్య వివాహములు గాని, వృద్ధవివాహములుగాని మచ్చునకైన గానరావు. లక్ష్మికి పరిణయకాలము సంప్రాప్తమగుచున్నది. సతత మా బాలిక తలిదండ్రులామె వివాహవిషయమును గూర్చియే తలపోయఁ జొచ్చిరి. ఊరివారందఱు వేంకటరాజునకే లక్ష్మి యొసఁగఁ బడునని లోలోన దలంచుచుండిరి. వేంకటరాజు దుండగముల నెఱిగినవారు అయ్యో! ఆ దుండగీడునకు కుసుమకోమల గాత్రియు, పరమసద్గుణఖనియునగు లక్ష్మినిచ్చియా పరిణయము గావించుట?" అని లోలోన విచారింపదొడగిరి. పెమ్మరాజునకు సుత వివాహ విషయాలోచనయే అతని హృదయమును మిగుల బాధింపఁదొడగెను. ఐశ్వర్యమునుగాని, బంధుత్వమునుగాని జూచి వేంకటరాజునకు, లక్ష్మినిచ్చి పరిణయము గావించిన లక్ష్మి యంగీకరించునో, యంగీకరింపదో, లోకులు తన్నుగురించి యెట్లు భావింతురో యను సంశయ మొకవంక పెమ్మరాజును బాధింపఁ జొచ్చెను. మఱియొకప్రక్క తనకీడగు భాగ్యభోగ్యములతోఁ దులదూగునట్టి బావమఱఁదియునగు వేంకటరాజునకు లక్ష్మినొసంగిన లక్ష్మి సిరిసంపదలతోఁ దులదూగుటయేగాక బంధుత్వముగూడ కలియుననియు ఆలోచించుచుండెను. కాని ఏకగర్భజనితులగుటచే తమ్ముఁడెట్టివాఁడయినను తన కుమార్తెను వేంకటరాజునకే యొసంగి, ఒక యింటివానిగఁ జేయవలయునని నరసాంబ దీక్ష.

## లక్ష్మి

లక్ష్మి దినదినాభివృద్ధినొందుచు పదునేను వత్సరముల ప్రాయురాలయ్యెను. ఆమె మిగుల సుగుణవంతురాలు. తెలివి తేటలయం దద్వితీయురాలు. దూరాలోచనగలజాణ. పౌరుష మునకు బుట్టినిల్లు. మనలక్ష్మి సాక్షాత్ లక్ష్మియవతారమే యగుటచే సౌందర్యమునం దద్వితీయురాలుగాకయుండునా? చెంపకు చేరెడు కన్నులు, సంపెంగ మొగ్గబోలు నాసిక, తుమ్మెద రెక్కల ఛాయనునించిన కురులుగలిగి సర్వాంగ సుందరియై యలరారుచుండెను. ఆమెను తనమేనమామకిచ్చి పరిణయము గావింప తన తలిదండ్రు లెంచుచుండిరని లక్ష్మి గ్రహింపగలిగెను. వేంకటరాజు దుశ్చేష్టలను ఆమె ఎఱుంగకపోలేదు. ఎఱింగియు తనకీడగువరుని వేఱొకని నిదివఱకే వరించెను. తలిదండ్రు లామె నడిగినపుడే తన యభీష్టము నెఱింగింప వచ్చునుగదా యని లక్ష్మి నివురుగప్పిన నిప్పు చందమున నూరకుండెను.

## క్రూరాలోచన

వేంకటరాజున కిప్పు డిరువదియైదు సంవత్సరములు. పెమ్మరాజు తనకు లక్ష్మి నొసంగియే పరిణయము గావించు నని ఎంతకాలము నుండియో తలంచుచుండెను. కాని ఇంత నఱకెన్నడు నట్టి ప్రసంగము ఇంటియందు జరిగినట్లాతం డూహింపజాలకుండెను. ఎట్టి కష్టనష్టములకైన నోర్చి లక్ష్మినే వివాహమాడవలయునని వేంకటరాజు అభిలాష. దినములు, వారములు, పక్షములు, నెలలు గడచుచున్నను వివాహ విషయాలోచనయే రాకుండెను. ఒకనాటి రాత్రి

సమయమున పెమ్మరాజు, నరసరాజు, వేంకటరాజు భోజనములు చేయుచుండిరి. అట్టి తరుణమున,—

నరసాంబ:—(భర్తతో) "మనలక్ష్మి వివాహవిషయ మేమి చేసితిరి? ఈడువచ్చిన కన్నియ నింకెంతకాల మిట్లు ఇంటిలో నుంచుకొందుము?" అని యడిగెను.

పెమ్మరాజు:—(మొగము చిట్లించుచు) నేనుగూడ దాని విషయమే ఆలోచించుచున్నాడను. ఇంతవఱకు లక్ష్మికి తగిన వరుఁడు నాకు గోచరింపలేదు. గుణము ప్రధానముగాని, ఐశ్వర్యాదులు ముఖ్యమైనవి కావుగదా!

నరసాంబ:—వధూవరు లిరువురు మన యింటనే యుండ వేఱాలోచన యేల?

పెమ్మరాజునకు మఱింత విసుఁగు జనించెను. ఏమియు జవాబు చెప్పదలంపలేదు. కాని "ఎంత దగ్గఱ బంధువైనను, ఎంత ఐశ్వర్యవంతుఁడైనను, గుణవంతుఁడు కానియెడల నాకుమారితె నొసంగ"ననెడి మాట లప్రయత్నముగ నాతని నోటినుండి వెడలెను. ఈప్రసంగము నంతయు వినుచుండిన వేంకటరాజునకు తల తిరిగిపోవ నారంభించెను. మేనువడఁక జొచ్చెను. తన తలకు కొఱవివంటించి నట్లాతఁడు భావించెను. తన యాసనమునుండి లేచి ఏదియో రసాభాసముజేయ నుంకించెను. కాని కొంచెము శాంతము వహించెను. ఏలకోగాని పెమ్మరాజును, నరసరాజును, చురచుర జూచెను. కాని వేంకటరాజు నరసరాజునందుబరపిన తీవ్రదృక్కులయందు మాత్రము విపరీతార్థము లేకపోలేదు. నరసరాజునుమఱి యొక మాఱు

తీవ్రముగ జూచి శిరమును పంకించెను. "ఈమూర్ఖుల కిరు వురకు నాచేతిలోఁజావు తప్ప" దని తనమనసులో ననుకొని భోజనానంతరమున తన శయ్యాగారమున కేగెను.

## లక్ష్మి నిశ్చయము

లక్ష్మి ప్రక్కగదిలోనుండి తన తలిదండ్రులకు జరుగు చుండిన సంభాషణను వినుచునే యుండెను. వేంకటరాజు చేష్టలన్నియు గన్నార గాంచుచునే యుండెను. ఆతని విపరీత దృక్కులయందలి గూఢార్థము నాకన్య గ్రహింపఁ గలిగెను. తన తండ్రికిని,తన మనోనాథుఁడగు నరసరాజున కేదో తప్పక ముప్పువాటిల్లునని నిశ్చయించి, వేంకటరాజు నొకకంట గని పెట్టియుండుటకు లక్ష్మి నిశ్చయించెను.

## లక్ష్మి సన్నాహము

ఆనాఁడు అమావాస్య. పెమ్మరాజు గ్రామాంతరమున కేగెను. అందుచే ప్రొద్దుగ్రుంకగనే కడమవారందరు భోజన ములచేసి శయనాగారముల కేగిరి. నరసరాజు ఆనాఁ డూరి వెలుపలనున్న పెమ్మరాజుగారి యెద్దుల కొట్టమునందు శయ నింపవలసెను. అందుచే ఆలసించినచీఁకటిరాత్రియందొంటరిగ పోవుట ప్రమాదకరమని యెంచి భోజనముకాగానే బయలు దేఱి నేరుగా నతఁడు ఎద్దుల కొట్టమున కేగెను, పెమ్మరాజు గృహమంతయు నిశ్శబ్దముగ నుండెను. నడిరేయిగాఁజొచ్చెను. ఎల్లరు గుఱకలుపెట్టి నిద్రించుచుండిరి గాని, లక్ష్మికి మాత్ర మారాత్రి నిద్ర పట్టకుండెను. ఎచటనో యించుక ధ్వని యగునట్లు సవ్వడి గనఁగొనఁ గలిగెను. పడకనుండి లేచి,

మెల్లన వేంకటరాజు శయన మందిరము కడకేగినది. లోన నేదియో ఇంచుక ధ్వనియగుచున్నట్లామె శ్రోత్రపుటంబులకు సోకెను. వేంకటరాజు పదును బెట్టుచుండ తళతళ మెఱయు చున్న గండ్రగొడ్డలి ఆమె నయనద్వయమునకు గోచరించెను. లక్ష్మికి నవ్వు, ఆశ్చర్యము ఆగకపోయెను. కాని ఎట్టటో తన శయ్యను జేరి ఏదియో జ్ఞప్తికి వచ్చినట్లు నటించి చరచర భోషాణము కడకు పోయినది. తన మృదు హస్తద్వయము నామందసము క్రిందకు బోనిచ్చి ఏదియో యొక వస్తువును బయటకు లాగినది. నిమేషమాత్రములో లక్ష్మి 'వీరలక్ష్మి' యవతార మెత్తినది. తన చీరను మరింత బిగువుగ గట్టినది. అడ్డము రాకుండునట్లు కురులను దృఢముగ ముడివైచినది. పాదరక్షలు ధరించినది. దక్షిణ కరమున తళతళ మెఱయు చున్న ఖడ్గమును ధరించినది. ఎడమ చేతియందు రజ్జువుల బూనినది. రవంతైన సందడిచేయక మఱల వేంకటరాజు పడక గది ద్వారమును సమీపించినది. అంతలో వేంకటరాజు తన పనిని పూర్తి చేసికొని తటాలున తలుపు తెఱచుకొని బయటకు వచ్చుచుండెను. లక్ష్మి ఆతని కంటబడకుండ ప్రక్కకు తొలఁగినది. లక్ష్మినిగాంచకుండగనే, హంతకుఁడు ఆగాఢాంధ కారమున లీనమయ్యెను.

వీరలక్ష్మి మామను అనుసరించినది. ఆసమయమందా వీరవనితపట్ల మున్ను మహిషాసురుని జంప నేగుచుండి జగజ్జననియా యను భ్రమజనింపక మానదు. తన మనో నాథుఁడగు నరసరాజును సంహరించుటకే వేంకటరా జేగు చుండెనని ఆమె గ్రహింప గలిగెను. మార్గ మధ్యమున

నవరేని తన్ను గుర్తించెదరేమో యను సంశయము లక్ష్మికి గలుగఁజొచ్చెను గాని, ఆమె అంతరంగము మాత్రము మిగుల ప్రోత్సహింపఁ దొడఁగెను.

## వీరలక్ష్మి

వేంకటరాజు మెల్లన పెమ్మరాజు వృషభశాలకరిగెను. మన కథానాయికయు నాతని వెంటనంటి వృషభశాలఁ జేరి ఒక రహస్యప్రదేశమున నందే దాగియుండెను. నరసరాజు గాఢ నిద్రా పరవశుఁడై యున్నట్లు వేంకటరాజు గ్రహింపఁ కలిగెను. వేంకటరాజు నను గ్రహించిన వా యనునట్లు కొట్టమునందలి వృషభము లన్నియు నొక్కసారిగా లేచి తోఁకల నాడించుట మొదలిడినవి. ఎద్దు లన్నియు అంకెలు వేయ ప్రారంభించినవి. తలలను నేలకానించి కొమ్ములతో మృత్తికను చిమ్ముచుండెను. కొన్ని పశువులు తమ వాలముల నెత్తి అటునిటు త్రిప్పుచు, బంధములఁ ద్రెంప నుద్యమించుచుండెను. పెమ్మరాజుగారి వృషభశాల యంతయు మిగుల సందడిగ నుండెను. అవన్నియుగాంచి తన్నెవరేని గుర్తించెదరో, తన కార్యమున కెట్టి యాటంకము గలుగునోయని, వేంకటరాజు తహతహ పడుచు మెల్లమెల్లగ నరసరాజుపడక దగ్గరకుఁ జేరెను. సవ్వడి ఎక్కువగుటచే నరసరాజున కించుక మెలకువ గలిగెను. కనులనువిప్పి చూచుసరికి భయంకర రూపముతో భుజమున గండ్రగొడ్డలి గలిగి వేంకటరాజు నరసరాజునకు సాక్షాత్కరించెను. నరసరాజున కించుక భయము కలిగెను. కాని అతఁ డప్రయత్నముగ నేదో పలుక బోగా "మూర్ఖా! నా మామయింటబానిసవై యింతకాలము

నుండి ఎంగిలికూడును గుడుచుచు నా కిల్లాలుగాఁదగిన లక్ష్మిని నేఁటికి నీవు వివాహమాడవలెనని దలంచు చుంటివా? చూడుము! ఈ గండ్రగొడ్డలిచే నొక్క వ్రేటున నీ శిరము వేయివ్రక్కలగు"నని తన ఆయుధమును పైకెత్తెను. వెనుకకు ఎత్తిన గొడ్డలి నటులే ఎవరో గట్టిగబట్టుకొని వెనుకకులాగి వేంకటరాజును పడద్రోసిరి. వెంటనే వేంకటరాజు పాశములచే బంధింపఁ బడెను.

## వేంకటరాజు దుర్మరణము

అప్పుడు గాఢాంధకారమైనను జరుగుచున్న చర్య లన్నియు నరసరాజు గాంచగలిగియే యుండెను. కాని కలయో, భ్రాంతియో, నిక్కమో యెఱుఁగజాలక నివ్వెఱపడి యట్టె శిలావిగ్రహము చందంబున నిలుచఁబడి పోయెను. వేంకటరాజు ఆశలడుగంటినవి. అతఁడేమియు మాటాడఁజాలక పోయెను. "క్రూరా! నీ వెవడవురా!" యనెడిపలుకులు మాత్రమతఁడ ప్రయత్నముగ బలుకగలిగెను. ఆవ్యక్తిగభాలున దుమికి తన దక్షిణకరమునందున్న ఖడ్గమును వేంకటరాజు హృదయమున నుంచి"మూర్ఖా! నే నెవరిననియా నీ సందేహము. ఇంతకాలమునుంచి ఎవరిని నీవు మనసార ప్రేమించితి వని దలంచుచుంటివో, ఎవరు నీ ప్రాణములను దీయ సంకల్పించెనో యట్టి వీరనారీరత్నమునగు లక్ష్మిని. ఇదిగో చూడుము. ఇంతకాలమునుండి నీవొనర్చుచుండిన దుష్కార్యములకును, పాపము నెఱుఁగని నిష్కల్మష హృదయుఁడగు నరసరాయని అన్యాయముగ జంపదలఁచినందులకును, పాప ఫలితముగ నిదే చూడుము. ఈ కరవాలమున నొక్కపోటు

బాడిచి నా కసిదీర్చుకొందుగాక !" అని వేంకటరాజు వక్షస్థలమున నావీరవనిత తన వాడి ఖడ్గముతో నొక్క పోటుపొడిచెను. వేంకటరాజు లేవబోయి ఏదియో ప్రత్యుత్తరము నీయఁబోయెను. కాని మరల నొకపోటు గళమున నాటుటచే వెనుక కొరిగి "హాలక్ష్మి ! ఎంత ప-ని-చే-సి-తి-వి" అని యసువుల బాసెను.

## శాంతి

నరసరాజునకుఁ గన్నులు తిరుగుచుండెను. నూతన వ్యక్తి తన యజమానుని కుమార్తె యగు 'లక్ష్మి'యని తెలిసినంతనే, యాతనికిఁ గలిగిన యాశ్చర్యమునకు మేర లేకుండెను. అట్టి గాఢాంధకారమున, ఒంటరియై, ఏతెంచి తన్నేల యామె రక్షింపఁ దలపెట్టెనో యెఱుఁగ జాలడయ్యె. వేంకటరాజు మరణించిన పిదప నొక్కింతసేపు ఇరువురును మాటాడక మౌనమువహించిరి. "లక్ష్మి! ఇదేమిటి? ఘోరహత్య యొనర్చితివి. ఎంతపాతక మొడిగట్టికొంటివి ! ఎంతటి అపనింద మోయనుంటివి ! అయ్యో ! ఇదేమి! రక్షకభటులు గాంచిన నీకును, నాకును, ముప్పువాటిల్లునుగదా !" అని మెల్ల మెల్లన నరసరాజు బలికెను. లక్ష్మి "నరసరాయా ! నీవు మిగుల పొరబడుచున్నావు. నేనే యిట్టి కార్యమును చేయకుండినచో నీవీపాటికపుడే యా దురాత్ముని కరవాలమున కెఱయై యుందువు. నీవు నిష్కల్మష హృదయుఁడవు. ఎల్లరు నీయట్టివారలే యని నీవు తలంతువు. వేంకటరాజు కడుంగడు దుర్మార్గుఁడు. ఇంతదనుక నెందఱినో స్త్రీల

నితఁడు చెఱఁబెట్టెను. నీవు నన్ను వివాహమాడ నుంటివని యెంచి అమాయకుఁడవగు నిన్ను జంపఁదలపెట్టెను. నేఁడు నాతండ్రి యూర లేకుండుటయు, అమావాస్యయగుటయు, నీవు వృషభశాలయందు శయనించుటయు, నాతఁడు గనుఁగొని నేఁడే నిన్ను జంపనుంకించెను. ఆ పరాత్పరుని అనుగ్రహమున నేను వాని చేష్టలను గనుఁగొనఁగలిగితిని. నిన్ను రక్షింపఁ గలిగితిని. వానిని కడతేర్చి నేను ధన్యురాల నైతిని. ఇంకొక్కటియే నా హృదయమున కొఱత గాను పించుచున్నది" అని పలికెను. నరసరాజు "నీవు నేఁడునన్ను రక్షించి పుణ్యము గట్టుకొనినందుల కెంతయు నేను కృతజ్ఞుఁడను. అయిన నీఋణము నేనెట్లు దీర్చుకొందునో నేనెఱుఁగ దగునా ?" "అన్నియు క్రమముగా ఎఱుఁగనగును. ఇప్పటికే తెల్లవాఱు సమయమగుచున్నది. ఇక నాలసించిన ముప్పు వాటిల్లును. పట్టుము. ఇరువురమీ శవమును ఊరివెలుపల నున్న పాడునూతియందు బారవైచెదము" అని లక్ష్మిఅనెను. పిమ్మట వారిరువు రా శవమును గైగొని యంధకారమున గలిసిపోయిరి.

## కష్టములంతరించినవి

మఱునాడు వేంకటరాజు హత్యగావింపఁ బడెనను వార్త మాచెర్ల గ్రామమందంతటను వ్యాపించెను. ఎల్లరు "ఛీ ! దుర్మార్గుఁడు! నేటికి వాని చావుతో మాచెర్లపౌరుల కష్టము లంతరించినవి !" అనియెడువార లే గాని "అయ్యో! పాప మనెడివారలు"! మచ్చునకైన గానరాకుండిరి. సోదరుని దుర్మరణమునకు నరసాంబ మిగుల చింతించెను. ఎంతదుర్మార్గుఁ

డయినను బావమఱఁది యగుటచే, పెమ్మరాజుగూడ కంట తడిపెట్టెను. లక్ష్మియు, నరసరాజును ఇరువురు నివ్వెరగప్పిన నిప్పుచందమున నూరకుండిరి. ఆనాఁటితో మాచెర్ల కష్టము లంతరించినవి.

## వైవాహికము

ఆనాఁడు త్రయోదశి శుక్రవారము. పెమ్మరాజుగారి గృహమున మంగళవాద్యములు మిన్నుముట్ట జయజయ ధ్వనులు చెలరేగుచుండెను. బంధువులు, స్నేహితులు, ఇరుగు పొరుగువారెందఱో మంగళగృహమున కరుదెంచిరి. వచ్చి పోయెడి జనులకు మితిలేక ఆనాఁడు గ్రామాధికారి గృహమంతయు నెంతో సందడిగ నుండెను. వేశ్యకాంత లొకవంక నాట్యమాడుచుండిరి. మరియొకదెస భూసురులు పనసలు జదువుచుండిరి. ఇంకొక దిక్కున పుణ్యస్త్రీలు మంగళహారతులు బాడుచుండిరి. మాచెర్ల గ్రామ మంతయు ఆనాఁడేలనో కళకళలాడుచుండెను. ఏయిల్లు చూచిన నెంతయో లక్ష్మీప్రదముగా నుండెను. ఆనాడు మాచెర్ల పౌరుల కోలాహలములకు మితిలేకుండెను. అట్టి పరమోత్కృష్ట సమయమున లక్ష్మి, మన వీరలక్ష్మి, నరసరాయని శిరముపై యెగిరియెగిరి తలంబ్రాలు పోయుచూ "నేఁటికి ఆజ్ఞాఱఁతయు దీఱిన"దని మెల్లన నర్సరాయని కర్ణములో నూదెను. నరసరాజు అపరిమితానందభరితుఁ డయ్యెను. గ్రామస్థులెల్లరు "పెమ్మరాజుగారు, తన కూఁతునకుఁదగిన వరునే తెచ్చినా"రని మిగుల శ్లాఘించిరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

—0—